# పాడుదాం తీయగా క్యాంప్కో పాట!

పాలు మీగడ నిండినది. కమ్మని కలలా రుచికరమైనది.

ఇది నారు నచ్చిన చక్కని చాక్లెట్. క్యాంప్కో క్రీమీ మిల్క్ చాక్లెట్.



మంచి కుటుంబ కథా చిత్రాలను ఎల్లప్పుడూ ఆదరిస్తారని రుజువు చేసిన
తెలుగు ప్రేక్షకావళికి శత (దినోత్సవ) సహస్ర వందనాలు!

నాగిరెడ్డి - చక్రపాణి



చందమామ విజయా కంబైన్స్

# బృందావనం

నిర్మాత

డి.వి.నరసరాజు బి.వెంకట్రామిరెడ్డి మాధవపెద్ది సురేష్



టెడ్డీ

చందమామ కలెక్షన్‌నుంచి బోలెడు రకరకాల చక్కని, మెత్తటి ముచ్చటైన ఆటబొమ్మలు. ప్రతి బొమ్మ ఎంతో ప్రత్యేకమైనది!

మీ బిడ్డ ఏళ్ళ తరబడి ఎంతో మమకారంతో ఒక్క క్షణం కూడా వదలకుండా ఆడుకొనేలా ఎంతో ప్రత్యేకంగా చందమామ కలెక్షన్‌లో ప్రతి ఆటబొమ్మను తయారుచేయడం జరిగింది.



బన్నీ

- ఏ వయస్సు పిల్లలకైనా - ఎంతో సురక్షితమైనది
- అత్యంత శ్రేష్ఠమైన సింథటిక్ ఫైబర్‌తో తయారుచేయడంవల్ల యివి దీర్ఘకాలం మన్నుతాయి.
- వీటిని శుభ్రంగా నీళ్ళతో కడగవచ్చు - చెడిపోవు, వంకరపోవు.

అంతేకాదు, మీ పిల్లలు సంబరపడే విధంగా ఓ అందమైన కానుక!

మీరు కొనుగోలుచేసే ప్రతి చందమామ సాఫ్ట్ టాయ్‌తో మీ దుకాణందారుని

ఉచిత గిఫ్ట్ కూపన్

అడగండి. దానిని పూర్తిచేసి, యిచ్చిన చిరునామాకు పోస్టుచేయండి. అనేక గంటల తరబడి మీ పిల్లలకు వినోదం కలిగించే కానుకల్ని మేము పోస్టులో పంపుతాం.

ఇప్పుడే కొనండి - ఈ సదవకాశం పరిమిత కాలం వరకే.

అన్ని ముఖ్యమైన షాపులలోనూ లభ్యమవుతాయి.



జంబో



ఫాక్సీ




# CHANDAMAMA COLLECTION

# సర్వకాల సౌందర్య సంరక్షణ!

# రూపాష్

## శాండల్

### టాల్కమ్ పౌడర్స్









MARKETED BY:
**VIJAYA SESH CHEMICALS
& COSMETICS (P) LTD.,**
MADRAS-600 007.




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి



## మానవతా విలువలను కాపాడుకుందాం!

భయంకరమైన మతకలహాల నుంచి మనదేశం ఇప్పుడిప్పుడే కోలుకుంటున్నది. నలభై అయిదు సంవత్సరాలకు పూర్వం, దేశ విభజన జరిగినప్పుడు మాత్రమే ఇటువంటి దారుణ మతకలహాలు జరిగాయి!

దాదాపు అయిదు వేల సంవత్సరాలుగా ఒకటిగా కలిసి ఉన్న సువిశాల దేశం నుంచి, మత ప్రాతిపదిక మీద కొంత భాగం మరొక దేశంగా విభజించబడింది. అది ఆనాటి రాజకీయ అవసరం మాత్రమే కాకుండా, ఒక నిర్బంధంగా కూడా పరిణమించింది. కాబట్టి ప్రజలు అందుకు అంగీకరించక తప్పలేదు. ఆ తరవాతనైనా ప్రజలందరూ శాంతి సామరస్యాలతో, సోదరభావంతో జీవించాలని ఆశించారు. మనదేశం సువిశాలమైనది కాబట్టి ప్రాంతీయ భేదాలు, భాషా భేదాలు, విభిన్నమైన జీవన విధానాలు తప్పవు. అయినప్పటికీ భిన్నత్వంలో ఏకత్వం సంతరించుకున్నది మనదేశం. అందుకు ఆధారభూతంగా ఉంటున్నది మానవతను గౌరవిస్తూ, యుగయుగాలుగా అభివృద్ధి చెందుతున్న మన భారతీయ సంస్కృతి!

పరిస్థితి ఇలా ఉన్నప్పుడు, మరి మనిషిని మనిషి ఎందుకు ద్వేషిస్తున్నాడు? ఈ మారణహోమాలు ఎలా జరుగుతున్నాయి? మనిషి మనసులో ద్వేషం, పగ, హింస ఉంటాయని చెబుతారు. అవి చెలరేగినప్పుడు, మనిషి ప్రాణాలకు గౌరవం ఉండదు. మానవత్వం మంట కలుస్తుంది. మతాలన్నీ ప్రబోధించే దైవభీతి కూడా నశిస్తుంది. కాబట్టి మనం మొట్టమొదట మనలోని మానవత్వాన్నీ, మానవతా విలువలనూ రక్షించుకోవాలి!

ఇటీవల మన రాష్ట్రపతి శ్రీ శంకర్‌దయాళ్‌శర్మ విద్యార్థులనుద్దేశించి మాట్లాడుతూ, "యుగయుగాలుగా సాగుతూన్న భారతీయ చింతనా స్రవంతికి మూలాధారం– ఏకత, కరుణ, నిష్పాక్షికత, అహింస, సేవ," అనీ, "విషాదం అనుభవించినప్పుడే సంతోషం విలువ తెలుస్తుంది," అనీ అన్నారు. మనం ఇటీవల కావలసినంత విషాదం అనుభవించాం. ఇప్పుడు వాటన్నిటినీ మరచి, మునుముందు ప్రజలందరి శాంతి సుఖాలకూ శ్రేయస్సుకూ దోహదం చేసే మానవతా విలువలను కాపాడుకోవడానికి కృషిచేద్దాం!

సంపుటి 91 మార్చ్ '93 సంచిక : 3

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00



**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956**

| | |
|---|---|
| *1. Place of Publication* | 'CHANDAMAMA BUILDINGS'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *2. Periodicity of Publication* | MONTHLY<br>Ist of each calender month |
| *3. Printer's Name* | B.V. REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Prasad Process Private Limited<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *4. Publisher's Name* | B.VISWANATHA REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Chandamama Publications<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *5. Editor's Name* | B.NAGI REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | 'Chandamama Buildings'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *6. Name and Address of individuals who own the paper* | CHANDAMAMA PUBLICATIONS<br>PARTNERS:<br>1. Sri B. VENKATRAMA REDDY<br>2. Sri B.V. NARESH REDDY<br>3. Sri B.V. SANJAY REDDY<br>4. Sri B.V. SHARATH REDDY<br>5. Smt. B. PADMAVATHI<br>6. Sri B.N. RAJESH REDDY<br>7. Smt. B. VASUNDHARA<br>8. Kum. B.L. ARCHANA<br>9. Kum. B.L. ARADHANA(Minor)<br>(Minor admitted to the benefits of Partnership)<br>'Chandamama Buildings'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |

I, B Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

*1st March 1993*

# రెండు నూతన దేశాలు

ప్రపంచమంతటా పాత సంవత్సరానికి వీడ్కోలు పలుకుతూ, కొత్త సంవత్సరానికి స్వాగతం పలుకుతూ డిసెంబర్ 31వ తేదీ రాత్రి గంటలు మోగాయి. అదేసమయంలో 'ప్రాగ్'లోనూ బ్రాటిస్లావా'లోనూ జెక్, స్లోవాకియా అనే రెండు 'నూతన' దేశాల ఆవిర్భావాన్ని చాటుతూ గంటలు మోగాయి. రెండు రిపబ్లిక్కులు విడిపోవడంతో ప్రపంచపటం నుంచి 'జెకొస్లోవేకియా' అనే దేశం అంతర్థానమైపోయింది. ఇరవై రోజుల తరవాత ఉభయదేశాలూ ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వం కోరి సంపాయించాయి. వాటితో కలిపి ప్రస్తుతం ఐక్యరాజ్య సమితిలో మొత్తం దేశాల సంఖ్య 180 అయింది.

1918వ సం॥లో ఆస్ట్రియాసామ్రాజ్యపతనంతో జెకొస్లొవేకియా దేశం ఏర్పడింది. ఆస్ట్రియా ఆధీనంలో వున్న బొహీమియా, మొరావియా — సైలీషియా, రుథేనియాలోని కొన్ని భాగాలు కలిసి ఆనాడు కొత్తదేశంగా ఏర్పడ్డాయి. థామస్ గ్యారిగ్ మజారిక్, ఎడ్వర్డ్‌బేన్స్ దేశ ఆవిర్భవానికి నాయకత్వం వహించారు. గ్యారిగ్ మజారిక్ మొట్టమొదటి అధ్యక్షుడై 1935 వరకు ఆ పదవిని నిర్వహించాడు. అతని తరవాత బేన్స్ అధ్యక్షుడయ్యాడు.

అప్పటికి అడోల్ఫ్‌హిట్లర్ రాజ్యవిస్తరణ పేరాశ జెకొస్లొవేకియావైపు మళ్ళింది. 1938వసం॥లో 'సుడేటన్ ల్యాండ్,' ప్రాంతాన్ని ఆక్రమించి కలుపుకున్నాడు. మరుసటి సంవత్సరం అతడు పోలండ్ మీద దాడిచేసి రెండవ ప్రపంచయుద్ధం రాజుకోవడానికి ముందు జెకొస్లొవేకియా నంతటినీ ఆక్రమించు కున్నాడు. బేన్స్ లండన్ చేరుకుని ప్రవాస ప్రభుత్వం నెలకొల్పాడు.

1945వ సం॥లో నాజీ జర్మనీ మిత్రపక్షాల చేతిలో ఓడిపోయి రెండవప్రపంచ యుద్ధం ముగిసిన తరవాత, జెకొస్లొవేకియా, సోవియట్ యూనియన్ అధీనంలోకి వచ్చింది. 1948వ సం॥ యాంటోనిన్ నోవోట్నీ నాయకత్వంలో కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చారు. యుద్ధ కారణంగా చితికిపోయిన ఆర్థికపరిస్థితులను పునరుద్ధరించడానికి ప్రజలు ఉదారవిధానాలవైపు మొగ్గుచూపారు. దాని ఫలితంగా నోవోట్నీ గద్దె దిగాడు. అలెగ్జాండర్ డ్యూబ్‌సెక్ నాయకత్వంలో 1968వ సం॥లో సంస్కరణవాదులు అధికారంలోకి వచ్చారు. అయితే, అతడి తీవ్రమైన సంస్కరణలను 'సోవియట్ రష్యా' అంగీకరించలేదు. ఆ తరవాత 'వార్సా ఒప్పందం సేనలు'




సోవియట్ రష్యా నాయకత్వంలో జెకొస్లొవేకియాను ఆక్రమించాయి. ఆ తరవాత ఆ దేశంలో ఎన్నో మార్పులు వచ్చాయి.

దేశ జనాభాలో మూడింట రెండు వంతులు జెక్‌లు–మిగతా స్లొవాక్‌లు, జర్మన్లు, పోల్స్, హంగేరియన్లు, ఇతర అల్ప సంఖ్యాకులు ఉన్నారు. అధిక సంఖ్యాకులు తమపైన ఆధిపత్యం చెలాయిస్తున్నారన్న కారణంగా అల్ప సంఖ్యాకులు విడిపోవడానికి సంసిద్ధులయ్యారు. 1992వ సం।। జూలై 17వ తేదీ స్లొవాక్ రిపబ్లిక్ తన స్వతంత్రతను చాటుకున్నది. అయితే వారిలో అధికసంఖ్యాకులైన స్లొవాక్‌లు విడిపోవడానికి ఇష్టపడనందువల్ల, ఉభయ రిపబ్లిక్‌లలో అభిప్రాయసేకరణ తరవాత నిర్ణయం తీసుకోవాలన్నారు. కాని, నవంబర్‌లో రిపబ్లిక్కుల 'నేషనల్ పార్లమెంటులు' దానిని నిరాకరించి– జెకొస్లవాక్ ఫెడరేషన్ రద్దుకు రాజ్యాంగాన్ని సవరించమని 'ఫెడరల్ పార్లమెంటు'ను కోరాయి. ఫెడరల్ పార్లమెంటు విభజనను అంగీకరించింది. నూతన సంవత్సరారంభంలో రెండు కొత్తదేశాలు ఏర్పడ్డాయి.

జనవరి 15వ తేదీ 'ప్రాగ్' నుంచి 'బ్రాటిస్లావా' నుంచి ఆయా విదేశాంగ మంత్రులు న్యూయార్కు చేరుకుని ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వం కోసం దరఖాస్తులు పెట్టుకున్నారు. సభ్యత్వం లభించిన సందర్భంగా, మిలాన్ నాజ్కో, "మహత్తరమైన ఈ రోజున స్లొవాకియా చరిత్రలో నూతన దశను చేరుకున్నాము," అన్నాడు. "మానవ హక్కులకోసం, స్వతంత్రంకోసం జెక్ రిపబ్లిక్ శాయశక్తులా తనవంతు కృషిని చేస్తుంది," అన్నాడు జోసెఫ్ జీలినిక్.



# సుబ్బారాయుడి కొబ్బరికాయ

బలభద్రుడనే యువకుడు చాలాకాలం గురుకులవాసం చేసి విద్యాభ్యాసం పూర్తి చేసుకుని, తన గ్రామానికి తిరిగి వచ్చాడు. తండ్రి వాడిని తన వ్యవహారాల్లో తోడుగా వుండమన్నాడు. ఆయన వ్యవసాయంచేస్తూ తీరిక సమయాల్లో సంస్కృత గ్రంథాలను తెలుగులోకి అనువదిస్తూంటాడు. అలా అనువదించిన గ్రంథాలను ఎప్పటికప్పుడు పట్నంలోని జమీందారుకుపంపితే, ఆయన పారితోషికంగా కొంత డబ్బిస్తాడు.

ఈ అనువాదాల పని బలభద్రుడిక్కూడా నచ్చింది. వాడు సాయపడడంతో చాలా కాలంగా కొరుకుపడని హంసపురాణమనే మహాగ్రంథాన్ని చాలా తొందరగానే అనువదించగలిగాడు బలభద్రుడి తండ్రి.

ఆ పని పూర్తయ్యాక ఆయన బలభద్రుడితో, "నాయనా! ఇది తీసుకువెళ్ళి జమీందారుకు చూపిస్తే, ఆయన ఎంతో సంతోషిస్తాడు. ఇంతవరకూ దీన్ని అనువదించడం ఏ పండితుడికీ సాధ్యపడలేదు," అన్నాడు.

బలభద్రుడు పట్నం బయలుదేరాడు. దారిలో వాడికి ఒక మనిషి ఎదురై, "నువ్వు బలభద్రుడివి కదూ! చాలా చిన్నప్పుడు చూశాను. ఇప్పుడు బాగా ఎదిగావు. విద్యాభ్యాసం పూర్తయింది! ఎక్కడికో బయల్దేరినట్లున్నావే?" అంటూ ప్రశ్నలవర్షం కురిపించాడు.

ఆ ప్రశ్నలకు జవాబిచ్చాడు కానీ, బలభద్రుడికాయనెవరోస్ఫురించలేదు. ఆయన అది గ్రహించిన వాడిలా నవ్వి, "నా పేరు సుబ్బారాయుడు. చదువుకున్న వాడికింత మతిమరుపు పనికిరాదు. నేను నీకు బాగా తెలుసు. గుర్తొచ్చిందా?" అని అడిగాడు.

సుబ్బారాయుడి గురించి బలభద్రుడికి చూచాయగా గుర్తుంది. చిన్నప్పుడాయన పిల్లలందరినీ చేరదీసి కథలు చెప్పేవాడు.

"వసుంధర"



కథ సగంలో వుండగా సుబ్బారాయుడి భార్య వచ్చి, ఆయన్ని తిట్టి పిల్లలందర్నీ తరిమేసేది. ఆతర్వాత ఆయన మళ్ళీ పిల్లల్ని చేరదీసి మిగతా కథ పూర్తిచేసే వాడు. కథ ఎంత వరకు చెప్పాడో పిల్లల కంటేకూడా ఆయనకే బాగా గుర్తుంటుంది. ఒకసారి చూసిన మనిషిని ఎన్నేళ్ళ తర్వాత నైనా గుర్తుపట్టేంత గొప్ప జ్ఞాపకశక్తి ఆయన దని అంతా చెప్పుకునేవారు.

ఆయన గురించి తనకు గుర్తు వచ్చిన విశేషాలుచెప్పి, వెంటనే గుర్తుపట్టనందుకు నొచ్చుకున్నాడు బలభద్రుడు.

సుబ్బారాయుడు నవ్వేసి, "దానిదేముంది కానీ, నువ్వు రేపటికల్లా తిరిగొచ్చేసే మాటైతే, పట్నం నుంచి నాకొక కొబ్బరికాయ తెచ్చి పెడుదూ— ఎల్లుండి పొద్దున్నే గుళ్ళో కొబ్బరి కాయ కొట్టాలి. మనూరి కొబ్బరికాయలు బాగుండడం లేదు," అన్నాడు.

"తప్పకుండా తెస్తానండి," అన్నాడు బల భద్రుడు.

"నిజంగా తెస్తావుకదా! ఈ ఊళ్ళో ఎవరి నడిగినా సరేనంటారు తప్ప, నే చెప్పిన పని చేయరు!" అన్నాడు సుబ్బారాయుడు.

నిజంగా తెస్తానని ఆయనకు మాటిచ్చి, ముందుకు సాగాడు బలభద్రుడు. వాడు సాయంత్రానికల్లా పట్నం చేరుకుని జమీం దారును చూడబోగా, ఆయన వాడు తెచ్చిన హంసపురాణం తీసుకుని, "ఇంత త్వరగా ఈ గ్రంథాన్ని అనువదించడం ఎలా సాధ్య మయింది?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

బలభద్రుడు తన గురుకులవాసం గురించీ, తండ్రికి సాయపడడం గురించీ చెప్పాడు.

జమీందారు వెంటనే ఒక సంస్కృత శ్లోకం చదివి, దానికి అర్థం చెప్పమన్నాడు. బలభద్రుడు తడుముకోకుండా ఆ శ్లోకానికి ఒక అర్థం కాదనీ, పద్దెనిమిది అర్థాలున్నా యనీ చెప్పి, అన్నింటినీ వివరించాడు.

జమీందారుఆశ్చర్యపడి, "నువ్వు సామాన్యు డివికాదు. నువ్విక్కడ నాలుగురోజులుంటే, నీతో పండిత సభ చేయాలనుంది," అన్నాడు.

బలభద్రుడికి సుబ్బారాయుడి కొబ్బరి కాయగురించి గుర్తుకొచ్చింది. ఆ విషయం జమీందారుకు చెప్పడం ఎలాగో తెలియ లేదు. తను సుబ్బారాయుడికి మాటిచ్చాడు. తన కారణంగా ఎల్లుండి ఉదయానికి సుబ్బారాయుడి భక్తిలో తేడా రాకూడదు. కానీ ఒక కొబ్బరికాయ గురించి జమీం దారు మాట కాదనడం బాగుండదు కదా!

అందుకని బలభద్రుడు, "అయ్యా! నా నాయనమ్మకు అనారోగ్యంగా వుంది. నేను మందుతీసుకుని రేపటికల్లా మా ఊరు చేరుకోవాలి," అంటూ అబద్ధం చెప్పాడు.

"దాందేముంది! ఆ మందేమిటో చెప్పు, నా మనిషి చేత మీ ఊరు పంపిస్తాను," అన్నాడు జమీందారు.

బలభద్రుడు కంగారుపడి, "నిజానికి నా నాయనమ్మ జబ్బు సగం పైగా మానసికం. నేను గురుకులానికి వెళితే, ఆమె నా గురించి బెంగ పెట్టుకుంది. ఈ మందు నేను దగ్గరుండి వేస్తేనే పనిచేస్తుందని వైద్యుడన్నాడు," అని చెప్పాడు.

జమీందారు వాడినిక బలవంత పెట్టక, ఆరాత్రికి దివాణంలో బస, భోజనం ఏర్పాట్లు చేయించి మర్నాడు వెళ్ళేముందు తనకు కనబడమన్నాడు.

ఆ రాత్రికక్కడ విశ్రాంతి తీసుకున్నాక, మర్నాడుదయమే బలభద్రుడు నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకుని సంతకు బయ ల్దేరి వెళ్ళాడు. అక్కడ అన్నిరకాల కాయ గూరలూ, పళ్ళూ వున్నాయి. కానీ కొబ్బరి





కాయల దుకాణాలు మాత్రం లేవు. వాకబు చేయగా, కొబ్బరికాయల దుకాణాల వాడొకడు మరణించాడనీ, ఆ కారణంగా ఆ దుకాణాల వాళ్ళెవరూ ఆ రోజు సరుకు అమ్మరనీ తెలిసింది.

బలభద్రుడు దివాణానికి తిరిగి వెళ్ళాడు. వాడికక్కడ వంటవాడు తటస్థపడ్డాడు. వాణ్ణి అడిగితే, బస్తాడు కొబ్బరికాయలున్నాయనీ, కానీ జమీందారు చెప్పందే తానెవరికీ ఒక్క కాయకూడా ఇవ్వననీ చెప్పి, "కొబ్బరికాయ వంటిదానికోసం జమీందారుగారినడగడం కక్కుర్తిగా వుంటుంది," అన్నాడు.

అయినప్పటికీ బలభద్రుడు, సుబ్బారాయుడికిచ్చిన మాటను గుర్తుంచుకుని జమీందారు దర్శనం చేసుకుని, "అయ్యా! నా నాయనమ్మకు కొబ్బరికాయ తినాలని కోరిక!" అంటూ తన పరిస్థితిని వివరించి చెప్పాడు.

"ఈ మాత్రందానికి నన్నడగాలా!" అని జమీందారు, బలభద్రుడికి పదివేల వరహాలతోపాటు నాలుగు కొబ్బరికాయలు కూడా ఇచ్చి పంపాడు.

బలభద్రుడు తన గ్రామంచేరుకునే సరికి చీకటి పడింది. వాడు తండ్రికి డబ్బిచ్చి జరిగింది చెబితే, "జమీందారు ఏ కావ్యానికీ ఇంతవరకూ ఇంత డబ్బివ్వలేదు. నువ్వాయనకు బాగా నచ్చావు. పండిత సభలో పాల్గొనివుంటే, నీకు లక్ష వరహాలు ఇచ్చి వుండేవాడు," అంటూ ఆయన కొడుకును మందలించాడు.

"గురుకులంలో నాకుడబ్బుకంటే, మాటే ప్రధానమని చెప్పారు. మనకు రాసిపెట్టి వుంటే, రాదలచిన డబ్బెప్పుడైనా వస్తుంది," అన్నాడు బలభద్రుడు.

"కానీ, సుబ్బారాయుడికిచ్చిన మాటకు కూడా నువ్వింత విలువ ఇవ్వడం, నాకు బాధగా వుంది. మనం రోజూ చేసే పనుల్లో ఏది ముఖ్యం, ఏది కాదు, అనే విచక్షణా జ్ఞానాన్ని అలవరుచుకోవాలి. అలా కానప్పుడు మన జీవితం ఒడిదుడుకుల పాలవుతుంది," అని సలహా ఇచ్చాడు బలభద్రుడి తండ్రి.

బలభద్రుడు, తండ్రి సలహాలోని సత్యాన్ని గ్రహించి, సరే జరిగిందేదో జరిగింది, అనుకుంటూ కొబ్బరికాయ తీసుకుని సుబ్బారాయుడింటికి బయల్దేరాడు. అయితే వాడు వెళ్ళేసరికల్లా ఇల్లు తాళం పెట్టి వున్నది. చుట్టుపక్కలఅడిగితే, "భార్యపోయినప్పటినుంచీ ఆయనఎప్పుడింటికి వస్తాడో, పోతాడో తెలియదు!" అని చెప్పారు.

బలభద్రుడు కాసేపా ఇంటి అరుగుమీద కూర్చుని సుబ్బారాయుడికోసం ఎదురు చూశాడు. ఆయన ఎంతకూ రాకపోయేసరికి, తను కొబ్బరికాయ తెచ్చినట్టు ఒక చీటీరాసి తాళంకప్పకు తగిలించి వెళ్ళిపోయాడు.

ఆ మర్నాటి ఉదయం వాడు కొబ్బరికాయ తీసుకుని సుబ్బారాయుడి ఇంటికేసి వెళ్ళాడు. ఇంటికి తాళం పెట్టేవున్నది. గుడికి పోయి పూజారి నడిగితే, ఆయన సుబ్బారాయుడింకా రాలేదన్నాడు. ఒక వేళ వస్తే, తను కొబ్బరికాయ తెచ్చినట్టు ఆయనకు చెప్పమని, పూజారికి చెప్పి, ఇంటికి వెళ్ళిపోయాడు బలభద్రుడు.

ఆరోజు మధ్యాన్నం భోజనాలయ్యాక, బలభద్రుడు మరొకసారి సుబ్బారాయుడి ఇంటికేసి వెళ్ళాడు. ఆ సమయంలో ఏదో పుస్తకం చదువుతున్న సుబ్బారాయుడు తలఎత్తి వాణ్ణి చూసి, "అందరికీ పుస్తకం చదివేప్పుడే నాతో పని పడుతుంది. ఏం కావాలి?" అని అడిగాడు చిరాగ్గా.

"మీకోసం నిన్నరాత్రి వచ్చాను. ఈవేళ పొద్దున్న వచ్చాను. ఇంటికి తాళం పెట్టి



వుంది. ఊరుకానీ వెళ్ళారా?" అని అడిగాడు బలభద్రుడు.

"ఊరా, పాడా? వచ్చేపోయేవాళ్ళ బాధ భరించలేక దొడ్డిదారిన వచ్చి ఇల్లు తాళం పెట్టి, లోపలే వుంటూంటాను. ఇదిగో, ఇప్పుడిలా తలుపు తీశాను— నువ్వొచ్చావు!" అన్నాడు సుబ్బారాయుడు.

"అయ్యో! మరి మీరు ఉదయాన్నే గుడిలో కొబ్బరికాయ కొట్టలేదా?" అన్నాడు బలభద్రుడు ఆతృతగా.

"దాందేముంది— ఉంటే కొడతాను, లేకుంటే లేదు. నాకీ మధ్య వంట్లో బాగుండడంలేదు. వైద్యుడేమో రోజూ చిటికెడు ఉగ్రభస్మం చప్పరించమన్నాడు. ఈసారి నువ్వెప్పుడైనా పట్నం వెళితే నాకు ఉగ్రభస్మం తెచ్చి పెడుదూ!" అన్నాడు సుబ్బారాయుడు.

తన చేతిలోని కొబ్బరికాయను చూసి కూడా, ఆ విషయం ఆయన మాట్లాడనందుకు, బలభద్రుడికి ఉక్రోషం వచ్చి, కొబ్బరికాయను ఆయన ముందు పెట్టి, దాని గురించి తను పడ్డ శ్రమంతా వివరించి చెప్పాడు.

అప్పుడు సుబ్బారాయుడు, "నాయనా! నాకేం మతిమరుపు లేదు. కానైతే నా మాటకు ఇంత విలువ ఇచ్చి నేనడిగింది తెచ్చిపెట్టిన వాళ్ళు మరెవరూ లేరు. నువ్వు కొబ్బరికాయ తేవడం నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. జరిగిందేదో జరిగిపోయింది కానీ, ఉగ్రభస్మం మాత్రం తేకు. అది చాలా ఖరీదు. మన ఊళ్ళో మరెవరినైనా తెమ్మని చెప్పు", అన్నాడు.

ఇది విని బలభద్రుడు తెల్లబోయాడు. మనం చేసే పనుల్లో ఏది ముఖ్యమో, ఏది కాదో, నిర్ణయించేందుకు అవసరం అయిన ఇంగితజ్ఞానాన్ని అలవరచుకోమని తండ్రి ఇచ్చిన సలహాలో వున్న సత్యం వాడికి మరింత బాగా అవగతమైంది.

అయితే, ఆ తర్వాత నుంచి బలభద్రుడికి, సుబ్బారాయుడు ఇంకేపనీ చెప్పకపోయినా, ఊళ్ళోవాళ్ళకు మాత్రం ఏవేవో పనులు చెపుతూనే వున్నాడు.






[మాయాభవనం నుంచి తప్పించుకున్న యువరాణి విద్యావతీ, మహేంద్రనాథుడూ సాయం కాలానికి కొండపాదతలంలోని ముని కుటీరాన్ని చేరుకున్నారు. వారిని చూసి సంతోషించిన ముని తన వృత్తాంతం తెలియజేశాడు. ముని, తన పినతండ్రి జితేంద్రనాథుడని మహేంద్ర నాథుడు గ్రహించాడు. ముగ్గురూ సంతోషంగా వీరగిరి రాజ్యానికి బయలుదేరారు. —తరవాత]

యువరాణి కనిపించకుండాపోయి రెండు వారాలు గడిచిపోయింది. ఇంకా ఆమె జాడ తెలియకపోయేసరికి, రాజు ప్రస్తుత గ్రహ స్థితి ఎలాఉన్నదో తెలుసుకోవడానికి వాచ స్పతాచార్యులను పిలిపించాడు. వాచస్పతా చార్యులు వచ్చి రాజ దంపతులకు నమస్క రించాడు. అప్పుడు అక్కడేఉన్న సేనాధిపతి ఉగ్రసేనుడు, "జగత్పతాచార్యుడి విషయం ఏమైనా తెలిసిందా?" అని అడిగాడు.

రాజు వీరసేనుడు, "జగత్పతి ఇతర జ్యోతి ష్కులతో సంప్రదించిన విషయాలేమిటో తెలిశాయా, ఆచార్యా!" అని అడిగాడు.

"ఇప్పటి వరకు ఏ ఒక్క విషయమూ తెలియరాలేదు, ప్రభూ! నేను నా శిష్యుడు మంజునాథుణ్ణి, వివరాలు సేకరించుకుని రమ్మని పంపాను. అతడు రేపో మాపో రాగలడని ఆశిస్తున్నాను. యువరాణి జాతకం ప్రకారం ఆమెకు ఇప్పుడు శుభ



సేనాధిపతికి నమస్కరించి, "ప్రభూ! రాజ ప్రాసాదం ముందు ఒక పల్లకీవచ్చి ఆగింది. పల్లకీవెంట ముగ్గురుగుర్రాలమీద వచ్చారు. వారిలో ఒకడు రాజదర్శనం కావాలని కోరుతున్నాడు!" అని చెప్పాడు.

"అతని పేరేమిటో చెప్పాడా?" అని అడిగాడు సేనాధిపతి.

"లేదు ప్రభూ! చూడడానికి ఏదో రాజ వంశానికి చెందిన వ్యక్తిలాగా ఉన్నాడు," అన్నాడు భటుడు.

"పల్లకీలో ఎవరున్నారో చూశావా?" అని అడిగాడు సేనాధిపతి.

"లేదు ప్రభూ! తెర అడ్డుగా ఉన్నది," అన్నాడు భటుడు.

సమయం ఆసన్నమయింది. గ్రహబలం ప్రకారం ఆమె ఈపాటికి రాజధానీ నగరం చేరుకుని ఉండాలి. ఒంటరిగా కాకుండా ఆమె మరిద్దరితోపాటు వస్తూ ఉండాలి," అన్నాడు వాచస్పతాచార్యులు.

"మంచిమాట చెప్పారు ఆచార్యా! నా బిడ్డ క్షేమంగా వచ్చి చేరాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను," అన్నది రాణి వజ్రేశ్వరీదేవి.

"ఉగ్రసేనా! నగరం ప్రధాన వీధులన్నిటిలోనూ భటులను అప్రమత్తంగా ఉండమని ఆజ్ఞాపించు!" అన్నాడు రాజు సేనాధిపతితో.

"చిత్తం, మహారాజా!" అని చెప్పి అతడు అక్కడి నుంచి భవనం వెలుపలికి నడవసాగాడు. అప్పుడొక భటుడు ఎదురుపడి, సేనాధిపతికి నమస్కరించి, "ప్రభూ! రాజ...

"సరే, వెళ్ళు. నేను ఇప్పుడే వస్తాను," అని చెప్పి సేనాధిపతి లోపలికి వెళ్ళి, ఇంకా జ్యోతిషాచార్యులతో మాట్లాడుతున్న రాజ దంపతులకు సంగతి చెప్పాడు.

వెంటనే రాణి వజ్రేశ్వరీదేవి, "ప్రభూ! పల్లకీలో మన కుమార్తె ఉన్నదేమో! ఏ రాకుమారుడో ఆమెను రక్షించి తెచ్చి ఉండవచ్చు. రండి,వెళ్ళిచూద్దాం!"అన్నదిఆత్రుతగా.

"వచ్చినది మన కుమార్తె విద్యావతి అయినట్టయితే ఆమె ఇంకా ఎందుకు పల్లకీలోనేఉంటుంది?రాజభవనం ఆమెకు కొత్త కాదు కదా? ఈ సరికి లోపలికి వచ్చి ఉంటుంది కదా!" అంటూ రాజు ఆసనం నుంచి లేచాడు.

ముగ్గురూ సేనాధిపతి వెంట భవనం వెలుపలికి నడవసాగారు. వాళ్ళు భవనం సింహద్వారం చేరే సరికి పల్లకీ దించబడి ఉన్నది. గుర్రాల మీద వచ్చిన ముగ్గురిలో ఒక వ్యక్తి గుర్రం దిగి, లోపలికి వస్తూ రాజుకు నమస్కరించాడు.

రాజు, "నువ్వు..." అని అన్నంతలో అతడు అడ్డుపడి, "హిమగిరి రాజ్యాన్ని పాలించిన త్రిలోకపతి మనవణ్ణి," అన్నాడు.

"హిమగిరి రాజు ఉమాపతి కదా?" అన్నాడు రాజు అనుమానంగా.

"నిజమే, రాజా! అతడు త్రిలోకపతిని పదవీచ్యుతుణ్ణి చేసి, ఆయన సింహాసనాన్ని ఆక్రమించుకున్నాడు. నేను త్రిలోకపతి తమ్ముడైన కైలాసపతి మనవణ్ణి. ఉమాపతి, హిమగిరి సింహాసనాన్ని ఆక్రమించిన తరవాత, మా తాత కైలాసపతీ, తండ్రి గజపతీ, నేనూ రాజ్యాన్ని వదిలిపెట్టవలసిన నిర్బంధం ఏర్పడింది. నా పేరు జగత్పతి!" అని వివరించాడా వ్యక్తి.



జగత్పతి అన్న పేరు వినగానే రాజూ, వాచస్పతాచార్యులూ విస్మయంతో ఒక్క క్షణం ఒకరిముఖాలొకరు చూసుకున్నారు.

ఉగ్రసేనుడి కుడిచేయి, నడుముకు వేలాడుతూన్న ఒరమీదికి చేరి కత్తి పిడిని ఒడిసి పట్టుకున్నది.

"నేను మీకొక శుభవార్త తెచ్చాను, ప్రభూ! మీ కుమార్తె విద్యావతిని రక్షించి, తీసుకు వచ్చాను. ఆమె పల్లకీలో ఉన్నది!" అన్నాడు జగత్పతి పల్లకీ కేసి చూపుతూ.

"నా ముద్దుల కుమార్తె విద్యావతి పల్లకీలో ఉన్నదా?" అంటూ రాణి అటుకేసి ఒక అడుగు వేసింది.

మహారాజు ఆమెను చూపులతో వారిస్తూ, "పల్లకీలో ఉన్నది విద్యావతి అయినట్టయితే, ఆమె ఇంకా ఎందుకు దిగిరాదు? రాజప్రాసాదం ఆమెకు కొత్త కాదు కదా? ఆమె ఆరోగ్యం బాగానే ఉన్నది కదా?" అని అడిగాడు జగత్పతిని.

"ఆమె సురక్షితంగా ఉన్నది ప్రభూ! ఆమెను ఇప్పుడే వెలుపలికి రమ్మంటాను," అంటూ జగత్పతి పల్లకీని సమీపించి,



తెరను పక్కకు తొలగించి, "రా, యువ రాణీ! మీ తల్లిదండ్రులు నీ కోసం ఎదురు చూస్తున్నారు!" అన్నాడు.

పల్లకీలో కూర్చుని ఉన్న మాలిని తనను ఎవరో 'యువరాణీ' అని సంబోధించడం విని, ఉలిక్కి పడింది.

"యువరాణీ! త్వరగా వెలుపలికిరా! నిన్ను చూడడానికి నీ తల్లిదండ్రులు తపించి పోతున్నారు!" అని హెచ్చరించి, జగత్పతి రాజదంపతులు ఉన్నచోటికి నడిచాడు.

తెర తొలగించుకుని వెలుపలికి వచ్చిన మాలిని బెదురుతూ దిక్కులు చూస్తూ అడుగులు వేయసాగింది. దూరం నుంచి చూడడానికి తమ కుమార్తెలాగే ఉన్న ఆ యువతి చూపులలో అంతటి బెదురు ఎందుకు వచ్చిందో రాజదంపతులకు అంతుబట్టలేదు.

సేనాధిపతి ఒక్క ఊపులో ముందుకు దూకి జగత్పతి చేయి పట్టుకుని, "ఆ యువతి యువరాణి విద్యావతికాదు. నువ్వు పొరబడినట్టున్నావు," అన్నాడు అధికారం ధ్వనించే కంఠస్వరంతో.

"ఆమె యువరాణి విద్యావతి. అందులో సందేహం లేదు!" అన్నాడు జగత్పతి.

"ఆ విషయం నీకెలా తెలుసు? యువ రాణిని ఇంతకు ముందెప్పుడయినా చూశావా?" అని అడిగాడు సేనాధిపతి.

ఆ ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్ప కుండా, "నేను ఆమెను దుండగుల నుంచి రక్షించి, నా భవనానికి తీసుకుపోయి, ఆమె మీద గ్రహాల దుష్టప్రభావం తొలగిపోయేంత వరకు, ఆమెకు ఎలాంటి కొరతా లేకుండా కాపాడి,ఇక్కడికితీసుకువచ్చాను," అన్నాడు జగత్పతి.

"యువరాణి మీద గ్రహాల దుష్టప్రభావం పడిందని నీకెలా తెలిసింది?" అంటూ వాచస్పతాచార్యులు ముందుకు వచ్చి, జగత్పతి మరొక చేతిని పట్టుకున్నాడు.

"ఆ విషయం నాకు జ్యోతిష పండితులు చెప్పారు," అన్నాడు జగత్పతి.

"నువ్వు ఇన్ని రోజులు కనిపించకుండా పోవడానికి కారణం ఇదా? విశ్వాసఘాత



కుని భవనం వెలుపలికి పరిగెత్తాడు. వాడు సింహద్వారాన్ని సమీపించి, గుర్రంమీదికి లంఘించబోతున్న సమయంలో, అటుగా వచ్చిన మహేంద్రనాధుడు— ఎవడో చేతిలో హారాన్ని పట్టుకుని పరిగెత్తుతున్నాడని భావించి,వాడికి అడ్డుతగిలాడు. వాడిచేయి పట్టుకునిలాగి కింద పడదోసి, మరొక చేత్తో వాడితలకు పెట్టుకున్న కిరీటంవంటి తల పాగాను కిందపడేట్టు కొట్టాడు. దాంతో జగత్పతి చేతిలోని హారం తాయెత్తుతో సహా మహేంద్రనాధుడి చేతిలోకి వచ్చింది. దానిని వడిసి పట్టుకుని మహేంద్రనాధుడు, "నీ మాయలు ఇక సాగవు," అన్నాడు.

అంతలో రాజదంపతులతో సహా అక్కడికి వచ్చిన వాచస్పతాచార్యులు, "ఆ దుర్మార్గుణ్ణి పట్టి బంధించండి," అని ఆజ్ఞాపించాడు.

వెంటనే భటులు జగత్పతిని పట్టుకుని పెడరెక్కలు విరిచి బంధించారు. అప్పుడు సేనాధిపతి మహేంద్రనాధుణ్ణి గుర్తించి, "నువ్వు వచ్చావా? ఈ దుర్మార్గుణ్ణి పట్టు కోవడానికి సహాయపడింది నువ్వా? శభాష్. యువరాణి ఎక్కడున్నదో కనుగొన్నావా?" అని అడిగాడు.

"ఇక్కడే ఉన్నాను. మామయ్యా!" అన్నది యువరాణి విద్యావతి.

ఆమధురకంఠస్వరంవినిపించిన వైపుకు తిరిగిన సేనాధిపతి, మునికుమారిలా ఉన్న

కుడా! యువరాణి గ్రహస్థితిని తెలుసు కుని, నువ్వే ఆమెను అపహరించుకుని పోయి ఎక్కడో దాచావు! ఆమెను తెచ్చి రాజుకు అప్పగించడానికి మంచి ముహూ ర్తంకోసం జ్యోతిష పండితులతో చర్చలు జరిపావన్న మాట! జగత్పతీ! నీ నీచకృత్యా నికి సిగ్గుపడుతున్నాను,"అంటూ వాచస్పతా చార్యులు అతడి చేతిని వదిలిపెట్టాడు.

వెంటనే జగత్పతి తన కంఠహారంలోని తాయెత్తును చేత్తో గట్టిగా పట్టుకున్నాడు. ఆ క్షణమే ఒక మెరుపు మెరిసి మరుక్షణంలో ఆ ప్రదేశాన్నంతటినీ దట్టమైన పొగ ఆవరిం చింది. అదే అదనుగా జగత్పతి, సేనాధిపతి నుంచి రెండవ చేయిని కూడా విడిపించు

విద్యావతినిచూసి, నవ్వుతూ, "ప్రభూ, విద్యావతి తిరిగి వచ్చింది!" అన్నాడు.

"వచ్చావా, తల్లీ! క్షేమంగా ఉన్నావు కదా?" అంటూ రాణి ఆనందబాష్పాలతో యువరాణిని కౌగిలించుకున్నది.

"విద్యావతీ! ఏమిటీ వేషం?" అంటూ రాజుఆమె తలనుఆప్యాయంగా నిమిరాడు.

ఇంతలో మాలిని వచ్చి యువరాణికి నమస్కరించింది. "పల్లకీలోవచ్చిందినువ్వన్న మాట!" అన్నది యువరాణి నవ్వుతూ.

తరవాత మహేంద్రనాథుడు రాజును సమీపించి నమస్కరించి, "నేను తలపెట్టిన కార్యంలో విజయం సాధించాను, మహాప్రభూ! యువరాణిని వెతికి తెచ్చి మీకు అప్పగించినందుకు నాకెంతో ఆనందంగా ఉన్నది. ఆ కార్యం సులభం కావడానికి అదృష్టవశాత్తు మార్గమధ్యంలో మా పినతండ్రి ఆశీస్సులు కూడా లభించాయి," అంటూ పక్కనే మందహాసంతో నిలబడి ఉన్న మునిని చూపించాడు.

రాజు ఆశ్చర్యంగా మునికేసి చూశాడు.

"వీరు మా పినతండ్రి మహిమాపురికి చెందిన జితేంద్రనాథుడు. సన్యాసం స్వీకరించారు!" అన్నాడు మహేంద్రనాథుడు.

"దేవీ ఆలయ దర్శనానికి వచ్చినప్పుడు రాజు వీరేంద్రనాథుణ్ణి చూశాను. ఆయన శత్రువులకు పట్టుబడి మరణించాడని విన్నాను, మీరు..." అన్నాడు రాజు.



"మాఅన్న సురేంద్రనాథుడు యుద్ధంలో మరణించాడు. అప్పుడు శిశువుగా ఉన్న మహేంద్రనాథుడూ, అతని తల్లీ నేనూ, మహిమాపురి రాజ్యాన్ని వదిలిపెట్టాము. కొన్నాళ్ళకు నేను సన్యాసం స్వీకరించాను. యువరాణిని వెదకడానికివచ్చిన మహేంద్రనాథుడు దైవవశాత్తు నాకు తటస్థపడ్డాడు. అతడే మహిమాపురి రాజ్యవారసుడని మీకు తెలియచేసి, అతని తల్లికి క్షమాపణలు చెప్పుకుని వెళదామనే నేను వచ్చాను," అన్నాడు ముని.

"మంచిది. ఆమె మా రక్షణలో సురక్షితంగా ఉన్నది. ఇప్పుడే పిలిపిస్తాను," అన్నాడు సేనాధిపతి.

"మీరు అనుమతించినట్టయితే నేనే స్వయంగా వెళ్ళి, మా తల్లికి ఈ శుభవార్త అందజేస్తాను," అన్నాడు మహేంద్రనాధుడు.

రాజు సేనాధిపతితో, "ఉగ్రసేనా! మహేంద్ర నాధుడికి కావలసిన రక్షణ ఏర్పాట్లు చేయించు. ఈ క్షణం నుంచి, అతడూ, అతని తల్లీ మన అతిథులు!" అన్నాడు.

"ప్రభూ ఒక్క మాట!" అంటూ రాణి వజ్రేశ్వరీదేవి రాజును సమీపించి, "సాహస వీరుడైన మహేంద్రనాధుడు చూడ చక్కగా ఉన్నాడు. మన కుమార్తెకు తగిన వరుడని భావిస్తున్నాను," అన్నది.

ఆ మాటలకు అక్కడి వారందరూ ఆనందం చెందారు. మహేంద్రనాధుడు చిన్నగా నవ్వుతూ, యువరాణికేసి చూశాడు. ఆమె సిగ్గుతో తలవంచుకున్నది.

"మంచికాలం వచ్చింది కదా! అంతా మంచే జరుగుతుంది రాణీ!" అని రాజు మునికేసి తిరిగి, "మహేంద్రనాధుడూ, అతని తల్లీ ఇక్కడికి వచ్చేంతవరకు మీరు ఇక్కడే ఉండవచ్చు!" అని వాచస్పతాచార్యులవైపు తిరిగి, "ఇప్పుడు యువరాణికి గ్రహస్థితి ఎలా ఉన్నదో ఆమె జాతకాన్ని పరిశీలించి తెలియజేయండి. రండి, అందరం లోపలికి వెళ్ళికూర్చుని మాట్లాడుకుందాం!" అంటూ రాజభవనం లోపలికి నడిచాడు.

రాజుకు ఒకవైపున రాణీ, యువరాణీ, ఆమె వెంట పరిచారిక మాలినీ, మరొక వైపునవాచస్పతాచార్యులూ,మునీనడిచారు.

సేనాధిపతి ఉగ్రసేనుడు మహేంద్ర నాధుడి భుజం తట్టి అభినందిస్తూ, "నీతో పాటు నేనూ వస్తాను. నీ వంటి సాహస వీరుణ్ణి కన్న ఆ తల్లి ధన్యురాలు! ఎన్ని కష్టాలు వచ్చినప్పటికీ తన రాజవంశం గురించి నీకు తెలియజేయని ఆ మహా సాధ్విని నేనే స్వయంగావచ్చి, సకలమర్యాద లతో రాజప్రాసాదానికి ఆహ్వానిస్తాను," అంటూ భవనం వెలుపలికి వచ్చాడు.

అక్కడ సిద్ధంగా ఉన్న రెండు గుర్రాలను అధిరోహించి, ఇద్దరూ అమితోత్సాహంతో మహేంద్రనాధుడి తల్లి నివాస స్థలానికి బయలుదేరారు. — (అయిపోయింది)






# మహాశిల్పి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, భీతిగొలిపే ఈ శ్మశానంలో, అర్ధరాత్రివేళ నువ్వు పడుతున్న శ్రమ ఏనాటికైనా ఫలించగలదన్న ఆశగానీ, గట్టినమ్మకం గానీ నీకున్నదో లేదో, నాకు తెలియడం లేదు. నువ్వు మహాశూరుడివన్న మాట నిజం! కాని, శూరులూ, పండితులూ కళలలో ఆరితేరిన గొప్ప వ్యక్తులలో, సాధారణంగా వుండే లోపమేమంటే వాస్తవ దృక్పథం, లోకజ్ఞానం కొరవడడం. వాళ్ళు స్వాభిమానం కొద్దీ, ప్రతి నమస్యనూ వ్యక్తి పరమైన ధోరణిలో తప్ప, వాస్తవదృష్టితో ఆలోచించలేరు. ఇలాంటి చిత్తప్రవృత్తి వల్ల, ఆఖరి క్షణంలో ఫలితాన్ని చేజేతులా జార విడుచుకుంటారు. నీకు ముందు హెచ్చ

## బేతాళ కథలు



రికగా వుండేందుకు, అమరేంద్రుడనే ఒక మహాశిల్పి అనాలోచిత ప్రవర్తన గురించి చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

చంద్రగిరిరాజ్యం రాజు కీర్తిచంద్రుడు కళాప్రియుడు. ఆయన కొలువులో నిత్యం కవితాగోష్ఠులు జరిగేవి. నృత్య ప్రదర్శన లుండేవి. అంతఃపురంలో ఎటుచూసినా రమణీయమైన చిత్తరువులు గోచరించేవి.

అయితే, కీర్తిచంద్రుడికి అన్ని కళలపట్ల ఆసక్తివున్నా,శిల్పకళపట్లమాత్రం ఆరాధనా భావం వుండేది. ఆయనకు ఒక అద్భుత మైన నాట్యమంటపాన్ని నిర్మించాలన్న కోర్కె కలిగింది. ఆ నాట్యమంటపం ఏ రూపంలో వుండాలో, ఎక్కడ ఎటువంటి శిల్పసుందరులు వుండాలో, ఏ దిక్కున ఏ దేవతామూర్తి వుండాలో-అన్నీ ఆలోచించ సాగాడు.

అటువంటి పరిస్థితిలో, ఆయనకు అమరేంద్రుడనే శిల్పి గురించి తెలిసింది. అమరేంద్రుడి నివాసస్థానం, రాజ్యానికి మారుమూలనున్న ఒక కుగ్రామం. అతడు శిల్పకళలో అనితరమైన ప్రతిభ కలవాడు. ఆ ప్రతిభను పదుగురికీ చాటిచెప్పుకోవా లనే ప్రయత్నం గాని, ధనార్జన చేయాలనే వ్యామోహం గాని అతడిలో లేవు.

అతడు కేవలం తన ఆత్మసంతృప్తి కోసమే, ఉలి చేత ధరించి శిల్పాలు చెక్కే వాడు. అతడి చేయి తగిలితే చాలు, కఠిన శిల కూడా మృదువుగా మారి, సుందర శిల్పంగా రూపం ఏర్పరుచుకునేది.

రాజు కీర్తిచంద్రుడు, అమరేంద్రుడికి రాజశిల్పి పదవి ఇచ్చి, నాట్యమంటప నిర్మాణ బాధ్యత అప్పగించడానికి నిర్ణ యించుకున్నాడు. ఆయన కొందరు రాజో ద్యోగులనుపిలిచి,అమరేంద్రుడికి రాజశిల్పి పదవి ఇవ్వబోతున్న సంగతి చెప్పి, సకల మర్యాదలతో రాజప్రాసాదానికి తీసుకు రమ్మని పంపించాడు.

అయితే,అమరేంద్రుడు, తనను తీసుకు వెళ్ళడానికి పల్లకీతో వచ్చిన రాజోద్యోగు లతో, "నాకు పదవుల మీద గాని, రాజా

శ్రయంమీద గాని ఆసక్తి లేదు. మహారాజు గారి కోరిక మన్నించనందుకు క్షమించ మని చెప్పండి," అని వారిని పంపేశాడు.

ఇదివిన్న కీర్తిచంద్రుడు, తానే స్వయంగా అమరేంద్రుడి వద్దకుపోయి, "నువ్వు గొప్ప శిల్పివి! అయితే, నీ కళను నీవరకే పరి మితం చేసుకుంటున్నావు. కళాకారుడికి తన కళను దాచుకునే హక్కులేదు. కళను విశ్వవ్యాపితం చెయ్యాలి. అప్పుడే కళకు సార్థకత," అన్నాడు.

అందుకు అమరేంద్రుడు, "మహారాజా! మీ మాటల్లో నిజం లేకపోలేదు. కాని, సర్వ సాధారణంగా రాజ్యపాలకులు తమ కీర్తి పతాకం ఎగురవేయడానికి, కళాకారులను పావులుగా వాడుకుంటారు," అన్నాడు.

ఆ జవాబుకు కీర్తిచంద్రుడు నొచ్చు కుని, "అమరేంద్రా! నువ్వు నన్ను సరిగ్గా అర్థం చేసుకోలేదు. నిజం చెప్పాలంటే, నీలాంటి కళాకారులు మహారాజుల కన్న గొప్పవారు. దయచేసి, నా మాటమన్నించు నేనెప్పటి నుంచో కలలు కంటున్న నాట్య మంటపాన్ని నీ చేతుల మీదుగా నిర్మాణం చెయ్యి. నా స్వప్నం నిజం చెయ్యి!" అన్నాడు.

అమరేంద్రుడు కొంతసేపు ఆలోచించి, "సరే, మహారాజా! మీరు చెప్పిన నాట్య మంటప నిర్మాణ బాధ్యత వహిస్తాను," అన్నాడు.



ఆ తర్వాత అమరేంద్రుడు, రాజు వెంట రాజధానీ నగరానికి వచ్చి, సుందర శిల్పా లను మలచడంలోనూ, మంటప నిర్మాణం లోనూ క్షణం తీరిక లేకుండా గడపసాగాడు.

ఒకరోజు యువరాణి విజయమాల, నిర్మాణంలో వున్న నాట్యమంటపం వద్దకు వచ్చింది. అక్కడ చెక్కివున్న శిల్పాలను చూసింది. సజీవమూర్తులుగా గోచరిస్తున్న ఆ అద్భుత శిల్పసంపదను చూసి ముగ్ధు రాలయింది.

ఆమె దృష్టి, చేత ఉలి పట్టుకుని శిల్పం చెక్కుతున్న అమరేంద్రుడి మీద పడింది. అతడి ముఖవర్చస్సు, సుందర రూపం చూడగానే, ఆమె ఒక అపురూపమైన వ్యక్తిని



చూస్తున్న అనుభూతికి గురైంది. ఆమెకు ఆ క్షణంలో అమరేంద్రుణ్ణి వివాహమాడాలన్న తలంపు కలిగింది.

ఆనాటి నుంచీ విజయమాల అప్పు డప్పుడూ నిర్మాణంలో వున్న నాట్య మంటపం వద్దకు వెళ్ళి, అమరేంద్రుడితో వాస్తుశాస్త్రం,శిల్పకళలనుగురించి మాట్లాడు తూండేది. అయితే, తన మనసులోని మాటను సిగ్గూ, సంకోచాల కారణంగా, అతడికి చెప్పలేకపోయింది.

మరి కొన్నాళ్ళకు మంటప నిర్మాణం పూర్తయింది. రాజు కీర్తిచంద్రుడూ, నగర ప్రముఖులూ వచ్చి చూసి, అమరేంద్రుడి కళాకౌశలాన్ని వేనోళ్ళ పొగిడారు. రెండు వారాల తర్వాత మంటప ప్రారంభోత్సవానికి శుభముహూర్తం నిర్ణయించి, ఆ సమ యంలో రాజనర్తకి హేమసుందరి నాట్య ప్రదర్శనానికి ఏర్పాట్లు ప్రారంభించారు.

ఈ పరిస్థితుల్లో, యువరాణి విజయ మాల, ఒకనాడు అమరేంద్రుణ్ణి చూడ వచ్చి, ఇంత కాలంగా తన మనసులో రహస్యంగా దాచుకున్న అభిప్రాయాన్ని బయటపెట్టింది.

అమరేంద్రుడు ఒక క్షణం నివ్వెరపోయి, తర్వాత తలవంచుకుని కొంతసేపు ఆలో చిస్తూ మౌనంగా వూరుకుని, తల ఎత్తి సూటిగా విజయమాల కళ్ళల్లోకి చూస్తూ, "నువ్వు యువరాణివి, నేను ఏ రాజ వంశానికీ చెందనటువంటి సామాన్యుణ్ణి!" అన్నాడు.

వెంటనే విజయమాల, "ఈ వంశ గౌరవాలూ, మర్యాదలూ గురించి మీరేమీ పట్టించుకోకండి. మీరు మహాశిల్పులు!" అన్నది.

"సరే, అయితే మన వివాహానికి మీ తండ్రిగారి అనుమతి అవసరం కదా! ఈనాటి నుంచి ఏడు రోజుల లోపల, మన వివాహానికి మీ తండ్రిగారి అనుమతి తీసు కునివచ్చి నాకు కనిపించు," అన్నాడు అమరేంద్రుడు.

అయితే, తను పెట్టిన వారంరోజుల గడువు ముగియ కుండానే, నాలుగవ

రోజున అమరేంద్రుడు, ఒక రాత్రి వేళ ఎవరికీ చెప్పకుండా నగరం వదిలి, తన గ్రామానికి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా అమరేంద్రుడి ప్రవర్తన, అతడి లోకజ్ఞాన శూన్యతనూ, లౌకిక విషయాల్లో అతడి అజ్ఞానాన్నీ చాటడంలేదా? తమ వివాహానికి రాజు అనుమతికోసం, రాకుమారికి వారం రోజులు గడువు పెట్టి, ఫలితం తెలుసుకో కుండానే, నాలుగవ రోజున నగరం వదిలి పోవడం, అతడిలో జీవితాన్ని గురించిన వాస్తవ దృక్పథం లేకపోవడమే కదా కారణం? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు,"అమరేంద్రుడిలో నువ్వనుకున్న లోకజ్ఞానశూన్యతా, జీవితాన్ని గురించిన వాస్తవ దృక్పథం లేకపోవడం లాంటి లోపాలేమీ లేకపోగా, అలాంటి విషయాల్లో నిశితమైన బుద్ధికుశలత కలవాడు. అతడు రాజు అనుమతి కోసం, యువరాణికి వారం రోజులు గడువు పెట్టడంలోనే, మనుషుల మనస్తత్వం గురించి, అతడికిగల లోతైన పరిజ్ఞానం స్పష్టంగా వెల్లడవుతున్నది. తనకు తానుగా ప్రేమించానని చెప్పి, వివాహమాడగోరిన యువరాణి, తండ్రి అనుమతికోసం వారం రోజులు వృధా పుచ్చదు. అమరేంద్రుడితో మాట్లాడివెళ్ళగానే, ఆ సంగతి తండ్రి దగ్గిర ప్రస్తావించి తీరుతుంది! కనుక అమరేం ద్రుడి హేతుబద్ధమైన అంచనా ప్రకారం, ఆ రోజునకాని,మరుసటిరోజునకాని అనుమతి సమస్య తేలిపోవాలి. అలాకాక, నాలుగు రోజులు గడిచినా యువరాణి కనిపించ లేదంటే— ఆమెకు తండ్రి అనుమతి నిరాక రించాడని నిర్ధారణ అవుతున్నది. ఇది గ్రహించినందునే అతడు, నగరం వదిలి తనస్వగ్రామానికివెళ్ళిపోయాడు!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : ఎన్. శివనాగేశ్వరరావు రచన]





# అధికారదాహం

శేఖరుడనే యువకుడు నగరంలో పెద్ద చదువులు ముగించుకుని, తన స్వగ్రామమైన విజయపురికి తిరిగివచ్చాడు. తండ్రి చిన్నతనంలోనే చనిపోవడంతో, తల్లి అతన్ని పెంచి పెద్ద చేసి ఉన్నతవిద్య చెప్పించింది.

అతడు ఒక వారంరోజుల పాటు ఇంట గడిపాక, తనెక్కడైనా ఉద్యోగ ప్రయత్నం చేస్తానన్నాడు తల్లితో. ఇందుకు ఆమె చాలా సంతోషించి, "నాయనా, నీ చదువుకు తగ్గ ఉద్యోగం, జమీందారుగారి దివాణంలో తప్పక దొరుకుతుంది. ఇందులో నీకు సాయపడేందుకు, రంగాపురంలోవున్న మీ నాన్నగారి బాల్యమిత్రుడు ధనంజయగారిని కలుసుకో," అని చెప్పింది.

మర్నాడు శేఖరుడు, రంగాపురం వెళ్ళి ధనంజయను కలుసుకున్నాడు.

ధనంజయ, శేఖరుడు వచ్చిన పని తెలుసుకుని, తన బాల్యమిత్రుడి కొడుకు పెద్ద చదువులు చదివినందుకు చాలా ఆనందించి, "జమీందారుగారి దివాణంలో ఉద్యోగం సంపాయించడం అంత తేలిక కాదు. బసవరాజు అనే ఆయన, అన్నిటికీ సైంధవుడిలా అడ్డుపడుతూంటాడు. అతడు ఎంత చెబితే అంత జమీందారుకు!" అన్నాడు.

"ఆ బసవరాజును మంచి చేసుకునే మార్గం ఏమిటి?" అని అడిగాడు శేఖరుడు.

"బసవరాజుకు అతిశయం, అట్టహాసం ఎక్కువ. అధికారదాహం జాస్తి. అందరూ తనను గొప్పగా చెప్పుకోవాలనీ, తన నామ జపం చేయాలన్నది ఆయన మనస్తత్వం," అన్నాడు ధనంజయ.

"సరే, ఆయన్ని కలుసుకుని, నాఅదృష్టం ఏపాటిదో చూసుకుంటాను, సెలవు," అని చెప్పి శేఖరుడు, జమీందారు దివాణానికి బయలుదేరాడు.

బొమ్మిడి అచ్చారావు

జమీందారుంటున్న పెద్ద బస్తీలో శేఖరుడికి, చలపతి అనే స్నేహితుడొకడున్నాడు. శేఖరుడు అతణ్ణి కలుసుకుని, తను వచ్చిన పనీ, దివాణంలోవుండే బసవరాజుగురించి తను విన్న సంగతులూ అతడికి చెప్పి, "దివాణంలో ఉద్యోగం సంపాయించాలంటే, ముందు ఈ బసవరాజును మంచి చేసుకోవాలి. అదెలా సాధ్యమో నాకర్థం కావడం లేదు," అన్నాడు.

తర్వాత స్నేహితులిద్దరూ బాగా ఆలోచించి, ఒక పథకాన్ని రూపొందించారు. దాని ప్రకారం శేఖరుడు ఉదయాన్నే దివాణానికి వెళ్ళి, బసవరాజును కలుసుకునేందుకు ప్రయత్నించాడు. కాని, ఆయన ఎవరెవరితోనో మాట్లాడుతున్నాడని నౌకరు చెప్పి, భోజనాల వేళకు అతణ్ణి, బసవరాజు దగ్గిరకు తీసుకుపోయాడు.

శేఖరుడు, ఆయనకు వినయంగా నమస్కరించి, తన విద్యాయోగ్యతల గురించి వివరించి, "అయ్యా, తమరు దివాణంలో నాకేదైనా ఉద్యోగం ఇప్పించాలి. జమీందారు దగ్గిర తమ మాటకు తిరుగులేదని విన్నాను," అన్నాడు.

బసవరాజు చాలా ధీమాగా తలాడించి, "ఉద్యోగాలు కావాలంటూ రోజూ ఎందరో, నాదగ్గిరకొస్తూంటారు. ఎంతమందికని నేను ఉద్యోగాలిప్పించను! సరే, రేపు చూద్దాం," అన్నాడు.



శేఖరుడుతిరిగిపోయి, చలపతికిజరిగింది చెప్పాడు. "ఇలా జరుగుతుందని, ఊహించిందేగదా! సరే, రేపువెళ్ళిరా. తర్వాత నేను రంగప్రవేశం చేస్తాను," అన్నాడు చలపతి.

ఆ మర్నాడూ శేఖరుడికి బసవరాజు దర్శనం అంత తేలికగా దొరకలేదు. నాలుగైదు గంటలు వేచి ఉన్న తర్వాత బసవరాజు, నౌకరు చేత అతణ్ణి పిలిపించి, "చూద్దాం, రేపు కనబడు!" అన్నాడు.

మర్నాడు శేఖరుడికి, బసవరాజుదర్శనం లభించింది. ఆ సమయంలో ఆయన ముందు నలుగురు పెద్దమనుషులు కూర్చుని, ఆయన్ను పొగడ్తలతో ఆకాశానికెత్తేస్తున్నారు.

ఆ సమయంలో చలపతి హడావిడిగా అక్కడికొచ్చి,చుట్టూకలయచూస్తున్నంతలో శేఖరుడు, "ఏమిటీ ఇలా వచ్చావు? ఎవరి కోసం చూస్తున్నావు?" అని అడిగాడు.

"మరేంలేదు, రామయ్యతాత కోసం చూస్తున్నాను. దివాణంలో నాకు ఉద్యోగం ఇప్పిస్తానన్నాడు," అన్నాడు చలపతి.

ఇది విని బసవరాజు ఉగ్రుడైపోయి, "నాతో ముందు చెప్పకుండా, ఆ నౌకరు వెధవ నిన్నెలా ఇక్కడికి పంపాడు? తోట మాలి రామయ్యతాత దివాణంలో నీకు ఉద్యోగం ఇప్పిస్తాడా? ఇక్కడ ఉద్యోగా లిప్పించగల సమర్థులెవరైందీ, నీకు తెలియదన్నమాట!" అన్నాడు.

ఆ వెంటనే చలపతి, "ఇంతకూ తమ రెవరు?" అని అడిగాడు బసవరాజును.

బసవరాజు విసురుగా తల తిప్పి శేఖ రుడితో, "వారం రోజులుగా దివాణంలో ఉద్యోగం కావాలంటూ, నా దగ్గిరకొస్తు న్నావుగదా! నేనెవరైందీ ఈ అమాయకుడికి చెప్పు," అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టు.

శేఖరుడు చలపతితో, "వీరు బసవరాజు గారు. వీరి మాటకు దివాణంలో ఎదురు లేదు. జమీందారుగారు వీరితో సంప్రతించ కుండా ఏ పనీ చెయ్యరు," అన్నాడు.

చలపతి, బసవరాజు కేసి నిర్లక్ష్యంగా చూస్తూ, "వీరా బసవరాజుగారంటే! వీరికి, రామయ్యతాత కన్న ఎక్కువ పలుకుబడి వున్నదంటే నమ్మడం ఎలా?" అన్నాడు.

ఈ మాటలతో బసవరాజుకు అక్కడున్న పెద్దమనుషులమధ్యతలకొట్టేసినట్లయింది. ఆయన చలపతికేసి తీవ్రంగా చూస్తూ, "నీకు రామయ్యతాత ఎలా ఉద్యోగం ఇప్పిస్తాడో, చూస్తాను! ఇక ఈ కుర్రవాడికి ఏదో ఉద్యోగం కాక, పనివాళ్ళందరి మీదా అధికారిగా ఉద్యోగం ఇప్పిస్తాను, ఎప్పుడో కాదు, రేపీపాటికి!" అన్నాడు.

ఆ విధంగా బసవరాజు మర్నాడే అన్నంత పనీ చేశాడు! శేఖరుడికి జమీందారుగారి దివాణంలో మంచి ఉద్యోగం దొరికి పోయింది. స్నేహితులిద్దరూ తమ పథకం పారినందుకు చాలా సంతోషించారు.





# చందమామ అనుబంధం-53



మనదేశపు పక్షులు - జంతువులు :

## రంగులకొంగలు!




మనదేశంలోని కొంగలలో రంగుల కొంగలు ప్రధానమైనవి. ఒక మీటరు ఎత్తు ఎదిగే ఈ కొంగల ఒంటినిండా రకరకాల రంగులు ఉంటాయి. ముఖం లేత పసుపుపచ్చ రంగుతో ఉంటుంది. ముఖం మీద ఈకలు ఉండవు. పొడవాటి ముక్కు పసుపుపచ్చ రంగుతో ఉంటుంది. రెక్కల మీద నల్లటి మచ్చలుంటాయి. తోక లేత గులాబీరంగుతో ఉంటుంది. శరీరం మీది ఈకలు పైభాగంలో తెల్లగా ఉంటాయి. అక్కడక్కడ ముదురు ఆకుపచ్చ రంగుతో, అడుగుభాగంలో నల్లటి చార ఉంటుంది. ఇవి రాబందుల పరిమాణంలో ఉంటాయి.

ఈ రంగుల కొంగలు మిగతా కొంగల్లాగే అంతగా లోతు లేని నీళ్ళలోనూ, బురదనేలమీదా గుంపులు గుంపులుగా తిరుగుతాయి. ఒక్కొక్క చోట ఆహార సంపాదనకు కదలకుండా ఉంటాయి. లోతులేని నీళ్ళలోని చేపలు, కప్పలు, పీతలు, నత్తలు మొదలైన వాటిని పట్టి తింటాయి.

ఇవి నీటికి సమీపంలో ఉన్న చెట్లకొమ్మలపై వాలుతాయి. ఎగిరేప్పుడు కొంతసేపు రెక్కలను హుందాగా గట్టిగా ఊపుతూ వెళ్ళి ఆపైన మెల్లగా వాలుతాయి.

పుల్లలతో చదునుగా నిర్మించిన వీటి గూళ్ళు చాలా పెద్దవిగానూ, దృఢంగానూ ఉంటాయి. వీటి మధ్య, నీటి మొక్కలతోనూ, నాచుతోనూ నింపుకుంటాయి. ఒక చెట్టుకు దాదాపు ఇరవై గూళ్ళు ఉంటాయి.

రంగులకొంగలకు స్వరపేటిక ఉండదు. కాబట్టి ఇవి మౌనంగానే ఉంటాయి. అప్పుడప్పుడు మెల్లగా మూలుగుతాయి లేదా కింది దవడ కదలికతో ఒకవిధమైన ధ్వనిని పుట్టిస్తాయి.



## మన సమకాలీన సాహిత్యం

"అమావాస్య అర్ధరాత్రి సమయంలో ఒంటరిగా చేతిలో దీపం పట్టుకుని నడుస్తున్నప్పుడు, ఆ దీపంకూడా ఆరిపోయి గాఢాంధకారం చుట్టుముట్టినట్టయింది," భావూకు ఒకే ఆసరాగా ఉన్న తల్లి మరణించినప్పుడు.

పూనేకు చెందిన పసివాడైన భావూ తండ్రి రావోజీ అంతకు ముందే ఇల్లు వదలిపెట్టి వెళ్ళిపోయాడు. ఎక్కడోవున్న గ్రహాలు తన మీద చూపే దుష్టప్రభావం తొలగి పోగానే తాను కోటికి పడగలెత్తగలనని కలలుగంటూ అతడు బొంబాయి నగర వీధులలోనూ, మరెక్కడెక్కడో

# హరినారాయణ్ ఆప్టే 'మీ'

తిరుగుతూ ఉంటాడు. అయితే అతడు ఆశిస్తున్న శుభఘడియలు మాత్రం రావేరావు పాపం!

భావూకు ఒకటిన్నర సంవత్సరం పెద్దదయిన అక్క గంగిని, ఇద్దరు భార్యలు పోయిన ఒక మధ్యవయస్కుడికి ఇచ్చి మూడో పెళ్ళి చేశారు. అతడామెను బానిసగా భావించి వేధించ సాగాడు. భర్త పెట్టే బాధలు భరించలేక ఆమె ఇల్లు వదిలి పారిపోయి తమ్ముడి దగ్గరికి చేరింది.

అదృష్టవశాత్తు భావూకూ, గంగికీ, శివరాం అనే పెద్దమనిషి ఆశ్రయం లభించింది. శివరాం అభ్యుదయభావాలు కలవాడు. భార్య కూడా ఆయన భావాలకు అనుగుణంగా నడుచుకుంటుంది. శివరాం దంపతులు ఏకైక సంతానం సుందరి కూడా తల్లిదండ్రులలాగే ఆదర్శవంతమైన జీవితం గడపాలనుకుంటుంది.

భావూ, గంగి చదవడానికి శివరాం సహాయ పడతాడు. అయితే, ఆనాటి సమాజం స్త్రీలు చదవడాన్ని అంగీకరించలేకపోయింది. పైగా, భర్త ఎంతటి దుర్మార్గుడైనప్పటికీ, అతన్ని వదిలివచ్చిన గంగిని నిరసించ సాగింది. ఆ కారణంగా, భావూ, గంగిలతోపాటు శివరాం కుటుంబం కూడా అనేక కష్టనష్టాలను ఎదుర్కోవలసి వచ్చింది. అయితే, వాళ్ళు తాము నడుస్తున్నది సక్రమమైన మార్గం అని విశ్వసించారు గనక, అన్నిటినీ ధైర్యంగా ఎదుర్కొని ముందుకు సాగారు.

భావూ పెరిగి పెద్దవాడై చదివి న్యాయవాది అయ్యాడు. అయినా, అతడు వృత్తిమీదకన్నా, సామాజిక రుగ్మతలను రూపుమాపడానికే ఎక్కువ ఆసక్తిచూపసాగాడు. సామాజిక సమస్యలను గురించి తరచూ ఉపన్యాసాలివ్వడంతోపాటు, సంఘ సంస్కరణ కోసం కృషి చేస్తున్న ఒక పత్రికకు సంపాదకత్వం వహించ సాగాడు. వీటి కారణంగా ఆయనకు కొందరు మిత్రులు లభించారు. మరెందరో శత్రువులు కూడా తయారయ్యారు!

ఆ పరిస్థితిని చూసి భావూ బాధపడ్డాడు. అయినప్పటికీ తాను కేవలం సొంత లాభంకోసం కాకుండా చుట్టూవున్న సమాజంకోసం పాటుపడాలనీ, తన జీవితాన్ని సమాజశ్రేయస్సుకు అంకితం చేయాలనీ నిర్ణయించుకున్నాడు. ఆ ఉన్నత ఆదర్శం నెరవేరాలంటే తాను ఎప్పటికీ వివాహం చేసుకోకూడదని కూడా శపథం చేశాడు.

అలా నిర్ణయం తీసుకున్న మరునాడే, శివరాం తన ముద్దులకుమార్తెను, పెళ్ళాడమని కోరడంతో నిర్ఘాంతపోయాడు భావూ. ఈ ప్రపంచంలో తాను అందరికన్నా శివరాంను ఎక్కువగా గౌరవిస్తాడు. సుందరి అంటే చిన్నప్పటి నుంచీ ప్రేమాభిమానాలున్నాయి. అయినా, తాను శపథం చేశాక ఇలా వాళ్ళు కోరడం అతనికి బాధకలిగించినా కాదనక తప్పిందికాదు. శివరాం దంపతులు గాని, సుందరిగాని, గంగికాని భావూ నిర్ణయానికి అడ్డు చెప్పలేదు. అతని అభిప్రాయాన్ని గౌరవించారు.



భావూ, భావానంద అని పేరు మార్చుకుని, కొందరు అనుచరులతో ఒక ఆశ్రమం నిర్మించుకుని సంఘసంస్కరణకోసం తన కృషిని సాగించాడు. కొంత కాలానికి అతని ఆరోగ్యం క్షీణించి పోయింది. తన తదనంతరం కూడా తన కృషిని కొనసాగించగలమని తన అనుచరుల చేత మాట తీసుకుని భావానంద కన్ను మూశాడు.

"మీ" (నేను) అనే ఈ మార్గదర్శకమైన మరాఠీ నవల 1916వ సం॥లో ప్రచురించబడింది. దీనిని హరినారాయణ్ ఆప్టే రచించాడు. స్వీయచరిత్ర ధోరణిలో, నూతన సాహిత్య శైలిలో సాగే ఈ నవల వాస్తవ దృక్పథంతో ఆనాటి భారతీయ సమాజానికి అద్దం పడుతుంది. మరాఠీ కథా సాహిత్యం మీద దీని ప్రభావం ఇంకా కొనసాగుతూనే ఉన్నది!

# మీకు తెలుసా?

1. ప్రాచీన ఈజిప్టులో, భద్రపరచే శవాలకు చుట్టడానికి భారతదేశం నుంచి తెప్పించిన నాణ్యమైన బట్టను ఉపయోగించేవారట. ఆ బట్ట ఏదో తెలుసా?
2. పాశ్చాత్యదేశాలలో 'వైద్యపితామహుడు'గా ఎవరిని చెబుతారు?
3. 'ఎల్లోరా' ప్రాంగణంలో ఉన్న ఒక హైందవ ఆలయాన్ని నిర్మించడానికి వంద సంవత్సరాలు పట్టింది. దాని పేరేమిటి?
4. మహమ్మదు ప్రవక్త జన్మస్థానం ఏది?
5. 'పౌనార్ ఆశ్రమం' స్థాపించిన వారెవరు?
6. బెంగాలును పరిపాలించిన ఒక మహమ్మదీయరాజు 'మహాభారతా'న్ని వంగ భాషలోకి అనువదించడానికి అజ్ఞాపించాడు. ఆయన ఎవరు?
7. 'యునెస్కో' అధ్వర్యంలో పిల్లలకోసం ప్రపంచ పర్యటన చేసిన ఒక సినీతార ఇటవల మరణించింది. ఆమె నటించిన మొట్టమొదటి చిత్రం ద్వారానే 'ఆస్కార్ అవార్డ్' అందుకున్నది? ఆ నటి ఎవరు? సినిమా ఏది?
8. బొమ్మలాట ఏ రెండు దేశాలలో ఆరంభమయింది?
9. కుతుబ్‌మీనార్, తాజమహల్, ఖజురహో, అజంతాగుహలు – వీటిలో అతిప్రాచీనమైనది ఏది?
10. అణుబాంబులు మొట్టమొదట ఎక్కడ ఎప్పుడు వేశారు?
11. 'పరంవీర చక్ర' ను మొట్టమొదట పొందిన వారెవరు?
12. లెనిన్‌గ్రాడ్‌కు మళ్ళీపాత పేరే వచ్చింది? అది ఏమిటి?
13. ఆగ్రాను పూర్వం ఏ పేరుతో పిలిచేవారు?
14. మియాన్‌మార్ (బర్మా) రాజధాని ఏది?
15. దక్షిణ భారతదేశంలో హిందువులను కూడా ఆకర్షిస్తున్న ముస్లిం 'దర్గా' ఏది?

## సమాధానాలు

1. మల్‌మల్ ఖాస్
2. హిప్పోక్రటీస్
3. కైలాస ఆలయం
4. మక్కా
5. వినోబా భావే
6. నుజ్రత్‌షా
7. ఆడ్రేహెప్ బర్న్
8. ఇండియా, ఈజిప్టు
9. అజంతా గుహలు
10. జపాన్‌లోని హిరోషిమా, నాగసాకి. 1945.
11. మేజర్ సోమనాథశర్మ (1947)
12. సెయింట్ పీటర్స్‌బర్గ్
13. అక్బరాబాద్
14. యంగూన్ (రంగూన్)
15. నాగూర్ క్వాదిన్‌వాలీ సాహిబ్ దర్గా



# గర్వభంగం

కందికుప్ప అనే గ్రామంలో, కైలాసశాస్త్రి అనే జ్యోతిషపండితుడుండేవాడు. జ్యోతిషంతోపాటు పూజలూ పునస్కారాలూ చేసి, జాతకంలో వుండే గ్రహబాధలూ అవీ నివారించగలడని, ఆయనకు పెద్దపేరు. చెట్టు లేనిచోట ఆముదపు మొక్కే పెద్ద చెట్టన్నట్టు, ఆయన్ని ప్రశ్నించి ఎదురు మాట్లాడగల మరొక జ్యోతిష సిద్ధాంతి లేక పోవడంతో, కైలాసశాస్త్రిలో అహంకారంతో పాటు, నోటిదురుసుతనం కూడా పెరిగింది.

అవసరం కొద్దీ తన దగ్గిరకు వచ్చిన వాళ్ళతో, ఆయన, "నేనన్నదే మాట! నే చెప్పింది జరిగి తీరుతుంది. అంతా నేచెప్పినట్లే చేయాలి. నామీద నమ్మకం లేక వెటకారం చేసిన వాళ్ళను శపిస్తాను!" అనేవాడు ధీమాగా.

ఒకసారి కాకతాళీయంగా ఇద్దరు, ముగ్గురు కైలాసశాస్త్రితో గొడవపడి, తిట్లు తిన్న కారణంగా కష్టాలపాలై, కైలాసశాస్త్రిని క్షమాపణవేడుకుని పూజలు చేయించుకోవడంతో, ఆయన నిజంగానే శాపాలు కూడా ఇవ్వగలడని జనం అనుకోసాగారు.

ఇది ఆనోటా ఆనోటా విన్న కైలాసశాస్త్రి, "ఆహాఁ, నా శక్తి ఏపాటిదో నలుగురికీ అర్థమైందన్నమాట! నాకు కర్ణపిశాచివుంది. ఎవరేమనుకున్నా ఇట్టే తెలిసిపోతుంది. నిత్యశివాభిషేకాలవల్ల, నాకు వాక్శుద్ధి లభ్యమైంది. నేనేదంటే అది జరిగి తీరుతుంది," అని జనాన్ని భయపెట్టసాగాడు.

ఇలావుండగా–రామనాధం అనే ఆసామీ కొత్తగా ఆ గ్రామానికి కాపరం వచ్చాడు. ఆయన అక్కడ కొంత పొలం కొని వ్యవసాయం చేసుకుంటూ, ఒక అద్దె ఇంట్లో నివసించసాగాడు. త్వరలోనే ఒక ఇల్లు అమ్మకానికొచ్చింది. రామనాధం ఆ ఇల్లు కొని, గృహప్రవేశం చేసే ముందు, ఆ

జె. ఉదయనాగశిరీష

ఇంట్లో ఏవైనా దోషాలున్నవేమో చూసి చెప్పమని, కైలాసశాస్త్రిని కోరాడు.

కైలాసశాస్త్రి ఇల్లంతా పరిశీలించి, "ఈ ఇల్లు కొనకముందే, నా సలహా అడగ వలసింది. ఇప్పుడు చేతులుకాలాక ఆకులు పట్టుకుని ప్రయోజనం లేదు. ఈ ఇంటికి ఇంతింతనరాని వాస్తుదోషం వున్నది. ఎంత కటువైనా నిజం పలకమని జ్యోతిషశాస్త్ర కారులు శాసించారు. అందువల్ల చెబు తున్నాను. ఈ ఇంటియజమాని పుటుక్కున చస్తాడు. ఈ ఇల్లు తక్షణం వదిలెయ్యి," అన్నాడు.

ఈ మాటలు విని రామనాథం నీరుకారి పోయాడు. అయితే, పక్కనే వుండి అంతా విన్న ఆయన అత్తగారు తోక తొక్కిన పాములా చిర్రుమంటూ లేచి, "ఏమిటే మిటీ, ఇంటి యజమాని పుటుక్కున చస్తాడా! నువ్వూ, నీ జ్యోతిషం మండిపోనూ, శుభమా అని నా అల్లుడు గృహప్రవేశ మవుదామనుకుంటూంటే, అవాచ్యాలూ, అపశకునాలూ పలుకుతావా? నీ కాళ్ళూ, చేతులూ విరిగిపోనూ! నీ నడుంపడిపోనూ!" అంటూ తిట్టసాగింది.

రామనాథం, అత్తగారి తిట్లదండకాన్ని ఆపాలని చూశాడు. కాని ఆమె వినిపించు కోలేదు.

అప్పుడు కైలాసశాస్త్రి, పిలకను గట్టిగా ఝాడించి, జంధ్యాన్ని కిందికీ, మీదికీ గట్టిగా గుంజుకుని, "ఆహాఁ! ఈ కైలాస శాస్త్రివంటి ఉద్దండ జ్యోతిష్కుడినే దుర్భాష



లాడేవాళ్ళు పుట్టుకొచ్చారన్నమాట, సరి! వినండి. ఒకే ఒక పూజ చేసి, ఒకే ఒక మంత్రం జపించి మిమ్మల్నందర్నీ అష్ట కష్టాల పాలు చేయకపోతే, నేను కైలాస శాస్త్రినే కాదు!" అని, కోపంతో నిలువెల్లా ఊగిపోతూ వీధిలోకి వెళ్ళాడు.

అయినా, అప్పటికీ రామనాథం అత్తగారు ఊరుకోక, "నువ్వు ఎక్కిన మంచం దిగకుండా నిండు ఆరునెలలు యమబాధలు అనుభవిస్తావు!" అంటూ వెనక నుంచి తిట్టసాగింది.

కైలాసశాస్త్రి అవమానభారంతో, కోపంతో ఉక్కిరిబిక్కిరైపోతూ, వీధిలో తాను ఎటు వెళ్ళుతున్నదీఆలోచించుకోకుండా, "వీళ్ళకు చేతబడిచేసి శాకినీ, ఢాకినీలనుప్రయోగించి సర్వనాశనంచేస్తాను," అని పళ్ళుకొరుకుతూ తలవంచుకుని నడుస్తూన్నంతలో, ఒక రెండెడ్లబండి ఆయన్ని ఢీ కొట్టింది.

ఆ దెబ్బకు శాస్త్రికి నడుంజారి, కాళ్ళూ, చేతులూ స్వాధీనం తప్పి కిందపడిపోయాడు. ఇది చూసిన జనం ఆయన్ని మోసుకుపోయి, ఇంట్లో మంచం మీద పడుకోబెట్టారు. దానితో ఆయన ఆరునెలల పాటు అర్థమైన వైద్యాలన్నీ చేయించుకుని, ఎలాగైతేనేం చివరకు మంచం దిగి నడవసాగాడు.

ఈలోగా రామనాథం అత్తగారి నోటి దురుసుతనం, తిట్ల ప్రభావం గురించి జనం కథలుగా చెప్పుకోసాగారు. ఆమె తిట్టుకు తిరుగు లేదనీ, కైలాసశాస్త్రివంటి



మహాజ్యోతిష్కుడే ఆమె తిట్టుకు ఆరు నెలలు మంచం ఎక్కాడనీ వాళ్ళు నమ్మారు. దానితో లోగడ కైలాసశాస్త్రి అంటే వున్న భయం, భక్తీ రామనాధం అత్తగారిపట్ల చూపించడం ప్రారంభించారు.

కైలాసశాస్త్రి బాగా తేరుకున్నాక, ఒకనాడు భార్యతో, "ఆ రామనాధం అత్త తిట్టుకు శాపం అంత శక్తి వున్నదని గ్రామంలో అమాయకులు నమ్ముతున్నట్టున్నది. ఆ రోజు వళ్ళుతెలియని కోపంలో వీధివెంట నడుస్తూ నేను ఎడ్లబండిని గుద్దానో లేక అదే నన్ను గుద్దిందో నాకే తెలియడం లేదు. సరే, గతం గతః. ఇప్పుడు నేను సహస్ర రుద్రాభిషేకం చేసి, ఆ వదరుబోతు నోరు జీవితాంతం పడిపోయేలా చేస్తాను. వేగిరం పూజకు సర్వం, సిద్ధం చెయ్యి," అన్నాడు పళ్ళు కొరుకుతూ.

కైలాసశాస్త్రి భార్య అంతా శాంతంగా విని, చిన్నగా నవ్వి, "కయ్యమైనా, వియ్యమైనా సమఉజ్జీలతో చెయ్యాలి. పూజలు చేస్తేనే గాని, మీరావిణ్ణి శపించలేరు. ఆవిడ ఏ పూజా పునస్కారాలు లేకుండానే వట్టి నోటి మాటతో కావాలనుకున్న వాళ్ళకు కీడు చెయ్యగలదు. నా సంగతికేం గాని, జనం దృష్టిలో మీకన్న ఆవిడే గొప్పది. అందు చేత, మీరావిణ్ణి మంచి చేసుకుని మీకిష్టం లేని వారినీ, మీ మాటకాదన్నవారినీ, ఆవిడ చేత తిట్టించండి. మీ పూజలూ అవీ పుణ్యంకోసం అట్టేపెట్టుకోండి," అన్నది.

భార్య ఇలా అనగానే కైలాసశాస్త్రి ఆలోచనలోపడ్డాడు. పండితుడై వుండి జన కల్యాణం కోరుకోవలసిన తనకూ, తాత్కాలి కోద్రేకంలో మర్యాద మరిచి తిట్లు తిట్టే రామనాధం అత్తగారికీ మధ్య వున్న తేడా ఏమిటో ఆయనకు అర్థమై ఉన్న గర్వం వదిలిపోగా లజ్జతో తలవంచుకున్నాడు.

ఇది గ్రహించాక కైలాసశాస్త్రి, ఇక ఆ గ్రామంలో వుండడానికి ముఖం చెల్లక, మరొక గ్రామంచేరి కొత్తజీవితం ప్రారంభిం చాలని నిర్ణయించుకుని, ఒకనాటి రాత్రి వేళ కుటుంబంతో సహా దూరప్రాంతానికి వెళ్ళిపోయాడు.





# భయస్థులు

సుమారు రెండువందల యేళ్ళకిందట మలయాళదేశంలోనితాలంగోడుగ్రామంలో పార్వతమ్మ అనే ఒక ఇల్లాలు ఉండేది.

ఆమె భర్త రామకుట్టి అనే ఆయన రాజాస్థానంలో ఒకఉద్యోగి. ఒకసారి అతను ఆస్థానంలోకి వెళ్ళాడంటే తిరిగి ఇంటికి ఎప్పుడు వస్తాడో చెప్పటం కష్టం. ఆ ఉద్యోగమే అటువంటిది.అందుచేత, అటువంటప్పుడు ఇంటిదగ్గర పార్వతమ్మ ఒక్కర్తే కాలం గడప వలసి వచ్చేది.

పార్వతమ్మకు సుబ్రహ్మణ్యేశ్వరుడంటే చాలా భక్తి. ఊరు వెలుపల గల సుబ్రహ్మణ్య స్వామి ఆలయానికి పోయి, రోజూ ఆమె మైమరచి ప్రార్థన చేసుకునేది. "స్వామీ, సుబ్రహ్మణ్యా! దర్శనమిప్పించవా? నేను సమర్పించే ఈ ప్రసాదాలు స్వీకరించవా?" అని చెప్పి దేవుణ్ణి భక్తితో మరీ మరీ వేడుకొనేది.

ఇలా ఆమె రోజూ ప్రార్థించటం గుడిలో పూజారి కనిపెడుతూ, ఆమె అమాయకత్వానికి లోలోపల నవ్వుకునేవాడు. ఒక రోజున ఆమె మామూలు ప్రకారం ప్రార్థిస్తూ వుండగా పూజారి, విగ్రహం వెనక దాక్కొని వుండి, "భక్తురాలా! నీ సేవకు మెచ్చాను. ఇవాళ పొద్దుగ్రుంకే సమయాన నీ కోరిక తీరుస్తాను," అని పలికాడు.

ఇవి కేవలమూ ఆ స్వామివారు పలికిన పలుకులే అని నమ్మి, పార్వతమ్మ చాలా సంతోషించింది. వెంటనే ఇంటికి చేరుకుని, భక్తి కొద్దీ ఇల్లు శుభ్రం చేసుకొని పంచ భక్ష్య పరమాన్నాలు తయారుచేసి, స్వామి కోసం వేచి ఉన్నది.

అంతలో సాయంకాలం అయేసరికి, ఒక భిక్షకుడు— వాళ్ళనే ఆదేశంలో పండారం అంటారు— "జై సుబ్రహ్మణ్యా!" అంటూ వచ్చాడు. అతనిని చూడగానే పార్వతమ్మ,

మలయాళ జానపద కథ



స్వామి ఈ రూపంతో వచ్చాడనుకొని, "రండి, స్వామీ, రండి, ఈ దీనురాలి ఆతిథ్యాన్ని స్వీకరించండి!" అంటూ పిలిచింది. వాడు ఆశ్చర్యపోయాడు. "నేను భిక్షకుణ్ణి," అన్నాడు. ఎంతచెప్పినాఆమెవినక, నిర్బంధించేసరికి, గత్యంతరంలేక వాడు లోపలికి వెళ్ళాడు.

ఆ భిక్షకుణ్ణి పీటవేసి కూర్చోబెట్టి, చక్కగా భిక్ష చేసింది పార్వతమ్మ. దొరికిందేచాలు నని వాడు బాగా ఆరగించాడు. ఐతే, ఎవ రైనా వచ్చి, ఈ స్థితిలో వున్న తనను చూస్తే ప్రమాదమని ఒక వంక భయపడుతూనే, వాడు భోజనం పూర్తి చేశాడు.

భిక్షకుడు భోజనం చేస్తూన్నంతసేపూ ఆమె భక్తి కొద్దీ గానం చేసింది. అంతలో పొద్దు గ్రుంకటం చూసి, పార్వతమ్మ దీపారాధన చేసింది.

అప్పుడు, "ఓ నా భక్తురాలా! తలుపు తియ్యి", అనే పిలుపు వినపడింది. ఆమె తలుపు తెరిచి చూడగా— విభూతిరేఖలు ధరించిన గుడి పూజారి ప్రత్యక్షమయ్యాడు.

"ఓహో, ఇప్పుడువచ్చిన ఈయనే నిజంగా స్వామి. ఇంతకుముందు వచ్చినది బిచ్చగాడే...", అనుకొని, పండారాన్ని చీకటిగా వుండే అటకపైన దాక్కో బెట్టింది పార్వతమ్మ.

పూజారిని ఎంతో భక్తితో లోపలికి పిలుచుకువచ్చి, అతనికి సమస్తమైన ఉపచారాలు చేసి, సత్కరించింది. ఇప్పుడు కూడా ఈ స్వామి మెచ్చుకోవాలని ఆమె భక్తితో గానం చేసింది.

ఆ సమయాన బైట, గుర్రం వచ్చే శబ్దం వినిపించింది. చూస్తే, ఆ గుర్రంమీద దిగిన వాడు ఆమె భర్తే! వెంటనే ఆమె పూజారి దేవుడికి నమస్కరించి, "స్వామీ! నా భర్తకు దేవుడంటే విశ్వాసం లేదు. పైగా చాలా కోపిష్ఠి. వారు శాంతించేవరకూ మీరు కాస్త ఆ అటకమీదఉండండి!" అంటూ, అతన్ని కూడా దాక్కోబెట్టింది.

ఎటు పారిపోదామన్నా దారీ తెన్నూ కనబడక, పూజారి కూడా అటక ఎక్కి ఒక పక్కన పడుకున్నాడు. పండారానికి కడుపు నిండింది కనుక, ఇట్టే నిద్రపట్టేసింది. వాడు

మరొక మూల ఉండటం చేత, పూజారి వచ్చిన సంగతి వాడికి తెలియదు. మరి కొంచెంసేపటికి పూజారికి నిద్రపట్టేసింది.

పార్వతమ్మ భర్త భోజనం చేస్తూ, "ఇదంతా ఏమిటీ, ఈ అట్టహాసం!" అని అడిగాడు. అందుకామె "మీరివాళ వస్తారని నాకు రాత్రి కల వచ్చింది. అందుకనే ఇవన్నీ చేశాను", అని సర్దిచెప్పింది. అతడు సంతోషించి, విశ్రాంతి తీసుకొని, వెంటనే పడుకొన్నాడు.

అర్ధరాత్రి అయింది.

పొట్టనిండా అపూర్వమైన భక్ష్యాలు పట్టించిన పండారానికి దాహం వేసింది. "మంచి నీళ్ళు! మంచినీళ్ళు!!" అని పెద్దగా అరిచాడు. ఈ అరుపు చెవిని బడి పార్వతమ్మ భర్తకు మెలకువ వచ్చింది. 'ఏమిటది?' అని అడిగాడు.

ఇందుకు ఆమె, "మనం, మరి పితృ దేవతలకు చేయవలసిన కర్మలు ఆచరించటం లేదు కదా. అందుకనే వాళ్ళు రెండు రోజులుగా ఇలా ప్రత్యక్షమవుతున్నారు!" అని యుక్తిగా సమాధానం చెప్పింది. అప్పుడు రామకుట్టి చేతులు జోడించి, పైకి చూస్తూ, "ఓ పెద్దలారా! ఇటుపైన మీకు జరపవలసిన కర్మకాండలన్నీ యధావిధిగా తప్పక జరిపిస్తాము. మన్నించండి", అంటూ ప్రార్థించాడు.

అక్కడ పండారానికి గొంతు ఎండుకు పోవటంచేత, "నీళ్ళు! నీళ్ళు!!" అని మళ్ళీ ఒకసారి అరిచాడు.



పార్వతమ్మ అప్పుడు అటకవైపు తిరిగి, "ఓ దైవమా! తూర్పుదిక్కున టెంకాయ ఉన్నది. అక్కడనే రుబ్బురాయి ఉన్నది. దానితో కాయకొట్టుకుని ఆ నీళ్ళు తాగి, శాంతించు!" అన్నది ప్రాధేయపడుతూ. ఈ మాటలోని అర్థాన్ని గ్రహించిన పండారం అటకమీద తూర్పుదిక్కున వెతకగా, చెప్పి నట్టుగానే టెంకాయ దొరికింది. తరవాత రాయి కోసం వెతికేసరికి, పండుకొనివున్న పూజారి గుండు ఆ చీకటిలో చేతికి తగిలింది. అదే రాయి అనుకుని పండారం వెంటనే టెంకాయను దాని మీద కొట్టాడు.

తల చితికే సరికి, "అయ్యో! అయ్యో!" అంటూ పూజారి గోలపెట్టాడు. ఏమీ తెలియక, ఆ చీకటిలో కంగారుతో తడుములాడేసరికి, అతనికి పండారం చెయ్యి దొరికింది. ఇద్దరూ కలియబడ్డారు.

కింద వున్న రామకుట్టి ఈ గోల విని భయపడ్డాడు. పార్వతమ్మ హడిలిపోతూ, "హయ్యో, దేవతలకు ఇవాళ ఉగ్రం వచ్చేసినట్టుంది. రోజూ మీరు వచ్చేవరకూ శాంతంగా ఉండండి, అని వేడుకుంటే అలానే ఉండేవాళ్ళు. ఇవాళ మీరు వచ్చారని తెలిసి కాబోలు, వాళ్ళు ఆగ్రహం చెందినట్టుంది", అని చెప్పింది.

అంతలో అటకపైనుంచి వాళ్ళిద్దరూ దభీమని కిందపడటం చూసిన రామకుట్టి, హడలుకుంటూ, వెంటనే గుర్రం ఎక్కి వుడాయించాడు. ఆ తొందర లోనూ కంగారులోనూ అతను కమ్చీతో గుర్రాన్ని కొడుతూ వుంటే, కమ్చీ కొస అతనికే వీపు మీద తగులుతూ వచ్చింది.

ఇది చూసి ఆ దేవతలే తనను వెంటాడుతున్నారనుకొని, "బాబూ! నన్ను విడిచి పెట్టండి! మీకు యేటా చేయవలసిన కర్మలన్నీ చేస్తా!" అని బతిమలాడుకుంటూ పోసాగాడు.

ఈ అదనులో పండారమూ, పూజారీ వాళ్ళదారిని వాళ్ళు వెళ్ళిపోయారు.

ఏం చెయ్యగలదు పాపం, పార్వతమ్మ! నమ్మిన దేవుళ్ళ లీలలకు విస్తుపోయింది. ఆమె భక్తి చివరకు ఇలా ఫలించింది.






సూర్యోదయం అయేవేళ వానరసేనకూ, రాక్షససేనకూ యుద్ధం ఆరంభమయింది. మామూలు ప్రకారమే రాక్షసులు వానరుల మీద బాణాలూ, పరిఘలూ, ఖడ్గాలూ, పరశువులూ ప్రయోగిస్తే, వానరులు రాక్షసుల మీద చెట్లూ, గండశిలలూ ప్రయోగించారు. ఇరుపక్షాలా రక్తం కాలువలు గట్టి పారి, యుద్ధరంగంలో లేస్తున్న దుమ్మును అణచివేసింది.

రాక్షసులతాకిడికి తట్టుకోలేకుండా ఉన్న వానరసేనలకు అండగా రాముడు విల్లు చేతబట్టి, రాక్షస సైన్యాలలో ప్రవేశించి, నిప్పులాటి బాణాలను రాక్షసుల మీద వర్షం లాగా కురిపించసాగాడు. రాముడి దెబ్బకు రాక్షసులు తట్టుకోలేక పోయారు. అతని బాణ ప్రయోగం వారికి తెలిసేదికాదు, దాని ఫలితం మాత్రమే తెలిసేది. చూసేవారికి చెట్లు పెద్దగా ఊగిపోవటం కనిపిస్తుంది గాని, ఝంఝామారుతం కనిపించదుగదా! ఆ విధంగా అక్కడ క్షణాలమీద అంతులేని రాక్షస సంహారం జరిగింది.

రాముడు తనకు సమీపంగాఉన్నసుగ్రీవ, విభీషణ, జాంబవంత, హనుమంతాదులతో, "నాలాగా బాణాలు ప్రయోగించటం ఒక్క శివుడికి తప్ప మరెవరికీ తెలియదు," అన్నాడు.

యుద్ధరంగంలో జరుగుతున్న రాక్షస హత్యాకాండ లంకలో రాక్షస స్త్రీలకు తెలిసింది. చచ్చినవారిలో అనేకమంది భర్తలు ఉన్నారు; సోదరులు ఉన్నారు; కొడుకు

34. రాముడికి దేవేంద్రుడి సహాయం



స్త్రీలు తమ మొగుళ్ళు చచ్చినందుకూ, సోదరులు చచ్చినందుకూ, కొడుకులు చచ్చినందుకూ శోకాలు పెట్టారు.

ఒక వంక రాముడు తన రాక్షససేనను కార్చిచ్చులాగా దహిస్తుంటే, రావణుడు తన సమీపాన ఉన్న మహోదర, మహాపార్శ్వ, విరూపాక్షులతో, "ఖరుణ్ణీ, కుంభకర్ణుణ్ణీ, ప్రహస్తుణ్ణీ, ఇంద్రజిత్తునూ చంపిన శత్రువును ఇప్పుడు సమూలంగా నిర్మూలిస్తాను! నా బాణాలు భూమ్యాకాశాలను క్షణంలో అంధకారంలో ముంచేస్తాయి. వానరసేనను కొంతసేపట్లో గుంపులు గుంపులుగా వధిస్తాను," అంటూ లేనిపోని ప్రగల్భాలు పలికాడు.

లున్నారు. వాళ్ళు పెద్దపెట్టున ఏడుస్తూ, ఈ పీడకంతటికీ మూలకారకురాలైన శూర్పణఖను తిట్టుకున్నారు. ఆ పాపిష్ఠిది వెళ్ళి రాముణ్ణి మోహించట మేమిటి? ఆ శూర్పణఖ మాటలు విని రావణుడు సీతను ఎత్తుకువచ్చి, రాముడితో ఈ విరోధం తెచ్చుకోవట మేమిటి? పోనీ ఆ సీత రావణుడికి స్వాధీన మయిందా అంటే అదీ లేదు! సీతను ఎత్తుకుపోవటానికి ప్రయత్నించిన విరాధుడు రాముడి చేతిలో చచ్చాడు కాడా? ఈ యుద్ధంలో నిశ్చయంగా రాముడే గెలుస్తాడు. రాముడి శక్తి అందరికీ తెలిసింది. కాని రావణుడికి మాత్రమే ఇంకా తెలియకుండా ఉన్నది! ఇట్లా అనుకుంటూ రాక్షస

రావణుడు ఎక్కి ఉన్న రథానికి ఎనిమిది గుర్రాలు పూన్చి ఉన్నాయి. దానిమీద రావణుడు భయంకరమైన తేజస్సుతో ప్రకాశిస్తున్నాడు. అతని వెంట రథాల మీద మహాపార్శ్వుడూ, మహోదరుడూ, విరూపాక్షుడూ ఉన్నారు. రావణుడు వానరసేనలో జొరబడి, అతిభయంకరమైన యుద్ధం చేశాడు.

రాముడు రాక్షససేనలో ఎలాటి విధ్వంసం సాగించాడో, రావణుడు వానరసేనలో అలాటి విధ్వంసమే చేశాడు. అది చూసి సుగ్రీవుడు, వానరసేనను కాపాడే భారం సుషేణుడికి అప్పగించి, తాను భయంకరమైన యుద్ధం చేయటానికి పూనుకుని,

భూమ్యాకాశాలు ప్రతిధ్వనించే విధంగా అతి భీకరంగా అరుస్తూ, అనేకమంది మామూలు రాక్షసులనుచంపి, రాక్షస వీరులను హతమార్చటానికి సిద్ధపడ్డాడు.

ఇది చూసిన విరూపాక్షుడు రథం మీది నుంచి సమీపంలో ఉన్న ఏనుగు మీదికి ఎగిరికూర్చుని,వానరసేనను ప్రవేశించాడు. వానరసేనాముఖంలోనే అతనికి సుగ్రీవుడు తగిలాడు. విరూపాక్షుడు బాణాలతో సుగ్రీవుణ్ణి బాధించాడు. విరూపాక్షుణ్ణి చంప నిశ్చయించి, సుగ్రీవుడు ఒక పెద్ద చెట్టు పెరికి విరూపాక్షుడుఎక్కిన ఏనుగు ముఖం మీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు ఏనుగు వెనక్కుతుళ్ళి, చచ్చిపడిపోయింది. విరూపాక్షుడు చప్పున ఏనుగు మీది నుంచి దిగి, కత్తీ, డాలూ తీసుకుని, సుగ్రీవుణ్ణి కత్తితో బలంగా కొట్టాడు. తరవాత ఇద్దరికీ సమంగా గొప్ప యుద్ధం జరిగింది. చిట్టచివరకు సుగ్రీవుడు విజృంభించి విరూపాక్షుడి చేత ముక్కులా, నోటా నెత్తురు కక్కేలాగ కొట్టి, అతన్ని చంపేశాడు.

విరూపాక్షుడు పోగానే అతని స్థానంలో వానరసేననునిర్మూలించటానికి రావణుడు మహోదరుణ్ణి నియమించాడు. మహోదరుడు వానరసేనను చంపుతూ వస్తూంటే సుగ్రీవుడు అడ్డుపడి, ఒక పెద్ద పరిఘ సంపాదించి, దానితో మహోదరుడి రథాశ్వాలనుచంపాడు. మహోదరుడు కోపంతో



వణికిపోతూ, వెంటనే రథం దిగి, గద చేతబట్టి, సుగ్రీవుడిపై తలపడ్డాడు.

త్వరలోనే సుగ్రీవుడిచేతి పరిఘా, మహోదరుడి గదా విరిగి పోయాయి. తరవాత ఇద్దరూ ముష్టి యుద్ధానికి దిగారు. కొంత సేపటికి ఇద్దరూ అలిసిపోయి, యుద్ధ భూమిలో దొరికిన ఆయుధాలు తీసుకొని పోరాటం సాగించారు. ఇంతలో మహోదరుడి చేతి కత్తి, సుగ్రీవుడి చేతి డాలులో గుచ్చుకున్నది. దాన్ని అతను లాగుతూండగా సుగ్రీవుడు అదే అదనుగా భావించి అతని తల కాస్తా నరికేశాడు.

ఈ సమయానికి మహాపార్శ్వుడు అంగదుడి సేన మీద విరుచుకుపడి, దాన్ని



ధ్వంసంచెయ్యసాగాడు. అంగదుడు మండి పడి, బంగారుకట్ల ఇనుప గుదియను విసిరాడు. ఆ దెబ్బకు మహాపార్శ్వుడూ, అతని సారథీ కూడా స్పృహ తప్పి కింద పడ్డారు. అదే సమయంలో గవాక్షుడూ, జాంబవంతుడూ అక్కడికి వచ్చి, పెద్ద శిలలతో మహాపార్శ్వుడి రథాన్ని నుగ్గు చేశారు, రథానికి పూన్చిన గుర్రాలను చంపారు.

ఇంతలో మహాపార్శ్వుడికి స్పృహ తెలిసి, గవాక్షుణ్ణీ, జాంబవంతుణ్ణీ బాణాలతో కొట్ట నారంభించాడు.

అది చూసి అంగదుడు ఉగ్రుడై, దూరం నుంచి ఒక పరిఘను విసిరి, వెంటనే పరిగెత్తుకుంటూ సమీపంగా వచ్చి, కొంత సేపు యుద్ధంచేసి, చివరకు మహాపార్శ్వుడి గుండెలో పిడికిలితో బలంగా పొడిచి, చంపేశాడు.

ఇక రావణుడు తానే యుద్ధభారం వహించ దలచాడు. అతను ఇతర వానర వీరులతో యుద్ధం చెయ్య దలచలేదు. అందరికీ మూలకందమైన రాముణ్ణే చంప నిశ్చయించాడు. అతను రాముడి కేసి వెళుతూ, మొదట తామసాస్త్రం వానరసేన మీద ప్రయోగించాడు. అది ప్రచండమైన అస్త్రం. దాని తాకిడికి వానరులు అమితంగా దెబ్బతిన్నారు. వారు భయపడి చెల్లాచెదరై పారిపోయి రావటం చూసి రాముడు ఆ క్షణమే యుద్ధసన్నద్ధుడై, ముందుకు వచ్చాడు. అతని వెంట లక్ష్మణుడు కూడా ఉన్నాడు.

రావణుడిపై మొదట విల్లెత్తి బాణాలు వేసినవాడు లక్ష్మణుడు. కాని రావణుడు అతని బాణాలన్నిటినీ దారిలోనే ఖండించి, రాముడి కేసి తిరిగి, అతని మీద తీవ్రంగా బాణవర్షం కురిపించాడు. రాముడు వాటిని తన బాణాలతో ఖండించాడు. ఇద్దరికీ చాలాసేపు ఘోరమైన యుద్ధం జరిగింది. ఒకరి అస్త్రాలను ఒకరు దారిలోనే ఖండించారు.

రావణుడు రాముడిపై అసురాస్త్రంప్రయోగించాడు. అది మహా భయంకరమైనది.



రాముడు ఆగ్నేయాస్త్రంతో దాన్ని అవలీలగా ధ్వంసం చేశాడు. అది చూసి సుగ్రీవుడు మొదలైన వానరవీరులు చాలా సంతోషించారు.

తరవాత రావణుడు రౌద్రాస్త్రం ప్రయోగించాడు. రాముడు గాంధర్వాస్త్రంతో దాన్ని ధ్వంసం చేశాడు. రావణుడు సౌరాస్త్రం ప్రయోగించాడు. రాముడు దాన్ని కూడా ఖండించాడు.

తరవాత ఇద్దరూ మామూలు బాణాలతో చాలాసేపు యుద్ధం చేశారు. రాముడు రావణుణ్ణి తన తీవ్రమైన బాణాలతో బాగా గాయ పరచి, కొంతసేపు విశ్రాంతి తీసుకున్నాడు.

అప్పుడు లక్ష్మణుడు బాణాలు ఎక్కుపెట్టి, మొదట రావణుడి ధ్వజం విరగగొట్టాడు. ఆ తరవాత రావణుడి సారథి తల నరికాడు. రావణుడి ధనుస్సును ముక్కలు, ముక్కలుచేశాడు.

లక్ష్మణుడు ఆగ గానే విభీషణుడు రావణుడి రథాశ్వాలను తన గదతో కొట్టి చంపాడు.

రావణుడు విభీషణుడిపై మండి పడి, రథంనుంచి నేలకుఉరికి,విభీషణుడి మీద ఒక శక్తిని విసిరాడు.

అది చూసి లక్ష్మణుడు ఆ శక్తిని మధ్య దారిలోనే తన బాణాలతో మూడుగా ఖండించాడు.

రావణుడు ఈసారి ఇంకా దారుణమైన శక్తిని చేతపట్టాడు. లక్ష్మణుడు చప్పున విభీషణుడికి అడ్డం వెళ్ళాడు. రావణుడు ఆ శక్తిని విభీషణుడిపై విసిరే లోపల లక్ష్మణుడు రావణుణ్ణి బాణవర్షంలో ముంచి ఎత్తాడు.

రావణుడు లక్ష్మణుడితో, "విభీషణుడికి అడ్డం వచ్చావు గనక, ఈ శక్తిని నీ మీదే వేస్తాను. ఇది ఈ క్షణమే నీ ప్రాణాలు తీస్తుంది," అంటూ వికటాట్టహాసం చేస్తూ ఆ శక్తిని లక్ష్మణుడి మీదనే ప్రయోగించాడు.

రాముడు ఆ శక్తిని శపిస్తూ, "నువ్వు వ్యర్థమగుదువు గాక!" అన్నాడు.

అయినా, అది సూటిగా లక్ష్మణుడి రొమ్ములో తాకింది. లక్ష్మణుడు పడి పోయాడు. శక్తి అతని శరీరంలో నుండి దూరి కింద పడింది. రాముడు కోపంతోనూ, దుఃఖంతోనూ ఆ శక్తిని తన చేతులతో విరిచాడు.

ఆ సమయంలో రావణుడు అతని మీద విడవకుండా బాణాలు వేస్తూనే ఉన్నాడు. రాముడు వాటిని లక్ష్యపెట్టకుండా, లక్ష్మ ణుణ్ణి కౌగలించుకుని, హనుమంతుడూ, సుగ్రీవుడూ మొదలైన వానరులతో, "మీరు లక్ష్మణుణ్ణి చూస్తూ ఉండండి. ఇక రావణుణ్ణి వధించక తప్పదు," అన్నాడు కోపావేశంతో.



కాని లక్ష్మణుడి స్థితి చూసి రాముడికి యుద్ధం చేసే ఆసక్తి కూడా తగ్గుతున్నది. ఇది తెలిసి సుషేణుడు రాముడితో, "లక్ష్మ ణుడి ప్రాణం పోలేదు. ఇతను బతికే ఉన్నాడు. నీకు విచారం వద్దు," అని ఓదార్చి హనుమంతుడితో, "నువ్వు వెంటనే వెళ్ళి, ముందు తెచ్చిన ఓషధీపర్వతం దక్షిణ శిఖరం మీద ఉండే ఓషధిని పట్టుకురా. మనం లక్ష్మణుణ్ణి బతికించు కోవాలి," అన్నాడు.

హనుమంతుడు ఓషధీ పర్వతం వద్దకు వెళ్ళాడు గాని, కావలసిన ఓషధిని పోల్చు కోలేక, పర్వతం యొక్క దక్షిణ శిఖరాన్నే ఏకంగా పట్టుకొచ్చాడు.

అతను సుషేణుడితో, "నువ్వు చెప్పిన ఓషధి నాకు తెలియలేదు. శిఖరమంతా పెల్లగించి తెచ్చాను. నీకు కావలిసిన ఓషధి నువ్వే తీసుకో," అన్నాడు.

సుషేణుడు హనుమంతుడి పటుత్వాన్ని మెచ్చుకుంటూ ఓషధిని పైకి తీశాడు. తరవాత అతను దాని రసాన్ని లక్ష్మణుడి ముక్కులో పిండాడు.

లక్ష్మణుడు వెంటనే బాధలన్నీ పోయి, స్పృహవచ్చి, లేచి నిలబడ్డాడు.

రాముడు ఆనందబాష్పాలతో లక్ష్మణుణ్ణి కౌగిలించుకుని, "లక్ష్మణా, నువ్వు చచ్చి కూడా బతికావు. నువ్వు నిజంగా చచ్చిపోయి ఉంటే నాకు సీతతో ఏం పని? ఈ

యుద్ధంతో ఏం పని? నా అదృష్టం కొద్దీ బతికావు," అన్నాడు.

"నువ్వు ఇలా బలహీనుడిలాగా మాట్లాడ రాదు. రావణుణ్ణిచంపి, విభీషణుణ్ణి లంకకు రాజును చేస్తానని ప్రమాణం చేశావు. నా కోసం నిరాశ మాని, రావణుణ్ణి చంపు. ఆ విధంగా విభీషణుడికి నువ్వుచేసిన వాగ్దానం నెరవేర్చుకో. సూర్యుడు అస్తమించే లోపల రావణుడు చావాలని నేను కోరుతున్నాను," అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుడు ఇలా అనగానే, రాముడు తన విల్లు ఎక్కుపెట్టి, రావణుడిపై బాణాలు ప్రయోగించాడు.

రామ రావణ యుద్ధంలో ఒక లోటు స్పష్టంగా కనబడింది. రావణుడు రథం మీద ఉండి యుద్ధంచేస్తున్నాడు. అయితే రాముడు మాత్రం నేలమీద నిలబడి యుద్ధం చేస్తున్నాడు.

ఈ లోటు సరి చెయ్యటానికి ఇంద్రుడు తన సారథి అయిన మాతలి చేత తన రథాన్ని భూలోకానికి పంపాడు. దానికి బంగారు నగిషీలున్నాయి, అనేక గంటలు న్నాయి, వైడూర్యంతో చేసిన నొగ ఉన్నది. అది ఉదయ సూర్యుడిలాగా వెలిగిపో తున్నది. మాతలి ఆ రథాన్ని తీసుకుని రాముడి వద్దకు వచ్చి, రాముడితో ఇలా అన్నాడు:

"రాముడా, నీకు విజయం కోరుతూ దేవేంద్రుడు ఈ రథాన్ని నీకు పంపాడు. దీనితోబాటు ఈ ఇంద్ర ధనుస్సునూ, కవచాన్నీ, బాణాలనూ, శక్తినీ ఇంద్రుడు నీకు ఇచ్చాడు. పూర్వం ఇంద్రుడు ఇదే రథం మీద, నేను సారథిగా పనిచేయగా, అసంఖ్యాకులైన దానవులను చంపాడు. ఇప్పుడు నువ్వు దీనిమీద ఎక్కి రావణుణ్ణి హతమార్చు."

మాతలి మాటలు విని రాముడు ఎంతో సంతోషించి, ఆ రథానికి ప్రదక్షిణం చేసి, భక్తితో నమస్కరించి, దానిమీద ఎక్కాడు. అటుపైన రామ రావణులకు, చూసేవాళ్ళకు అద్భుతం అనిపించేటట్టుగా యుద్ధం జరిగింది.



# పారని పన్నాగం

పూర్వం బాగ్దాదు నగరాన్ని ఏలిన నూర్‌షా గొప్ప వినోదప్రియుడు. నగరంలోని రహమతుల్లా అనే పెద్ద వ్యాపారి హఠాత్తుగా చనిపోయాడు. అతడి ఆస్తికి వారసులెవరూ లేరు.

బాగ్దాదులో నివసిస్తున్న అబ్దుల్లా అనే పేద యువకుడు, రహమతుల్లా ఆస్తిని చేజిక్కించుకోవడానికి ఒక పథకం వేసి, ఒకనాడు నూర్‌షా దర్బారుకు వెళ్ళాడు.

వాడు, నూర్‌షాకు సలాం చేసి, "జహాన్‌పనాహ్! ఈ నగరంలో ఒంటరిగా వుంటూ చనిపోయిన వ్యాపారి రహమతుల్లా ఆస్తికి వారసులు లేరనడం నిజంకాదు. అతడు ఒంటరివాడు; నేనూ ఒంటరివాణ్ణి! తన వారంటూ ఎవరూలేని వాళ్ళకు, అల్లా తండ్రి వంటివాడు. కాబట్టి, రహమతుల్లా, నేనూ ఒక వరసన సోదరులం. చనిపోయిన నా అన్న రహమతుల్లా ఆస్తికి నన్ను వారసుడుగా ఉత్తరువు ఇమ్మని తమరిని కోరుతున్నాను," అన్నాడు దీనంగా.

ఖలీఫా నూర్‌షా చిరునవ్వుతో, "నీవన్నది నిజం. నీ అన్న ఆస్తి నీకు చెందాల్సిందే!" అని కోశాధికారిని పిలిచి, "రహమతుల్లా ఆస్తిలో ఒక దీనారం, అతడి సోదరుడైన ఈ అబ్దుల్లాకు ఇవ్వు," అని ఆజ్ఞాపించాడు.

"ఒక్క దీనారమా!" అంటూ ఆశ్చర్యపోయాడు అబ్దుల్లా.

"అవును. నీలాంటి సోదరులు రహమతుల్లాకు, ఈ రాజ్యంలో వేలకొలదీ ఉన్నారు. ఖజానాలో కలిసిన రహమతుల్లా ఆస్తిలో, వారి వారి భాగాలు వారికీ చేరాలి గదా," అన్నాడు ఖలీఫా.

దీనారం తీసుకుని నీరసంగా ఇంటికివెళ్ళాడు అబ్దుల్లా. కొద్దిసేపటి తర్వాత ఖలీఫా మనుషులు వచ్చి, వాడికి ఖలీఫా బహుమతిగా పంపిన వెయ్యిదీనారాల సంచీ ఇచ్చారు. ఈ విధంగా అబ్దుల్లా పన్నాగం పారకపోయినా, ఖలీఫా కృపకుపాత్రుడయ్యాడు.

– యస్. లోకేశ్వరి





# పున్నమిరాత్రి పిశాచం

మార్కాపురం అడవి ప్రాంతాన, కట్టెలు కొట్టేవాడొకడు చిన్న గుడిసెలో నివసిస్తూండే వాడు. వాడికి పెళ్ళీడుకొచ్చిన చంప, చుక్క అనే కూతుళ్ళిద్దరున్నారు. చంపకు ఏడాది వయసులో తల్లి పోయింది. కట్టెలు కొట్టే వాడు, దుర్గమ్మ అనే ఆవిణ్ణి రెండో పెళ్ళి చేసుకున్నాడు. చుక్క దుర్గమ్మ కూతురు.

దుర్గమ్మ, చంపను రాచి రంపాన పెట్టేది. ఇంటెడు పనీ చంప చేతనే చేయించేది. పైపెచ్చు, "దరిద్రపు పీనుగా! ముచ్చు మొహమా!"అంటూరోజంతాతిడుతూండేది.

చంపకు, సవతితల్లి తిట్లు ఎంతో బాధ కలిగించేవి. తనకు త్వరగా పెళ్ళి అయ్యేలా చేసి, సవతితల్లి తిట్ల బారి నుంచి తనను కాపాడమని,భగవంతుణ్ణిప్రార్థిస్తూ ఉండేది.

ఒక వేసవికాలం పున్నమిరాత్రి, గుడిసెలో గాలి రాక నిద్ర పట్టని చంప, బయటికి రాబోతూ, నులకమంచం మీద కూర్చుని మాట్లాడుకుంటున్న తండ్రి,పిన్నిలమాటలు విన్నది.

"అమ్మాయిలు పెళ్ళికిఎదిగారు. ఈ సంవత్సరం తల తాకట్టు పెట్టి అయినా, చంపకు పెళ్ళి చేయాలి!" అంటున్నాడు తండ్రి.

దానికి దుర్గమ్మ మండిపడి, "నీకేమయినా మతిపోయిందా? చంపకు పెళ్ళి చేసి పంపించేస్తే, ఇంటెడు పనీ ఎవరు చేస్తారు? ఇద్దరి పెళ్ళిళ్ళూ ఒకేసారి చేయగల తాహతు లేదు మనకు. ముందు చుక్కకు ఏదైనా సంబంధం చూడు," అన్నది.

ఇది విన్న చంపకు దుఃఖం పొంగుకు వచ్చింది. ఇక తనకు జీవితంలో ఇప్పుడున్న నరకం నుంచి విముక్తిలేదన్న భయం కలిగింది. ఇలా బతికే కన్నా అడవిలో ఏ క్రూరమృగానికో ఆహారం అయిపోవడం మేలనుకుంటూ, ఆమె గుడిసె తలుపు దగ్గిరగా వేసి, అడవిలోకి వెళ్ళింది.

మాచిరాజు కామేశ్వరరావు

అక్కడ చంపకు ఏ క్రూరమృగమూ తటస్థ పడలేదు. ఇక ఇది పనికాదని ఆమె అక్కడ కనిపించిన ఒక పాడుపడిన బావి కేసి వెళ్ళేంతలో, చెట్టుపైనుంచి ఒక పిశాచం కిందికి దూకి, "ఆగు! ఆగు!" అంటూ అరిచింది.

చావడానికి సిద్ధపడిన చంప, పిశాచాన్ని చూసి ఏమాత్రం భయపడక, "నా చావుకు అడ్డుపడతావెందుకు?" అన్నది.

పిశాచం ఎంతో ఆప్యాయంగా గుచ్చి గుచ్చి అడిగాక, చంప తన కథ అంతా చెప్పి, "మా పిన్ని తిట్లు సహిస్తూ బతికే కన్న, చావడం నయం!" అన్నది.

"ఛీ, ఛీ! ఈ స్వల్పానికే, నీకు జీవితం పట్ల విరక్తి కలిగిందా? ఉండు!" అంటూ పిశాచం బావిలోకి దూకి, ఒక పాతకాలపు గోనెసంచీ తెచ్చి, చంపకు ఇచ్చింది.

"ఇది దేనికి?" అంటూ చంప ఆశ్చర్య పోయింది.

"ఇది దగ్గరుంటే, మీ పిన్ని తిట్లు నీకెంతో ఆనందంకలిగిస్తాయి.ఇంకా,ఇంకాతిట్టాలని కోరుకుంటావు! ఎందువల్లనంటే— ఆమె తిట్టిన ప్రతితిట్టుకూ,ఇందులో ఒక బంగారు కాసు పోగుపడుతుంది. మీ పిన్ని ఒకరోజున తిట్టినతిట్లవల్లపోగుబడినబంగారుకాసులతో, నీ పెళ్ళి ఘనంగా జరిగిపోతుంది. అయితే, ఈ గోనెసంచీమహిమ ఒకరోజుకు మాత్రమే పరిమితం సుమా!" అన్నది పిశాచం.



చంప, పిశాచానికి కృతజ్ఞత చెప్పుకుని, గుడిసెకు తిరిగి వచ్చి, గోనెను పశువుల కొట్టంలోని గడ్డిమోపుల కింద దాచి, ఏమీ ఎరగని దానిలా పడుకున్నది.

మర్నాడు తెల్లవారుతూండగా దుర్గమ్మ కీచుమంటూ చంప వీపు మీద గట్టిగా చరిచి, "బారెడు పొద్దెక్కినా నిద్రలేవవేమే, దరిద్రపు మొహమా! పశువుల కొట్టం బాగు చేసి, ఆవుపాలు పిండుకురా," అన్నది.

"పిన్ని తిట్టిన మొదటి తిట్టు!" అనుకుంటూ చంప పశువుల కొట్టంలోకి పోయి, గోనె సంచీలో చేయిపెట్టి చూసింది. లోపల మిలమిల మెరుస్తున్న బంగారుకాసు ఒకటి కనిపించింది!



ఆరోజు, చీకటి పడి కట్టెలు కొట్టేవాడు ఇల్లు చేరాడు. ఆ సరికి దుర్గమ్మ తిట్టిన తిట్లతో, సంచీలో రెండు వందలకు పైగా బంగారు కాసులు పోగయ్యాయి. చంప వాటిని తండ్రికి చూపి, "ఇది పున్నమిరాత్రి పిశాచం నాకు చేసిన మేలు!" అన్నది.

పక్కనే వుండి అంతా విన్న దుర్గమ్మ పళ్ళు కొరుకుతూ, "నా తిట్లకు రాలిన బంగారుకాసులు, నాకే చెందుతాయి. ఈ డబ్బుతో చుక్క పెళ్ళి రంగరంగవైభోగంగా చేస్తాను," అన్నది.

కట్టెలు కొట్టేవాడు మొదటిసారిగా దుర్గమ్మ మాటకు అడ్డు చెబుతూ, "ఈ అన్యాయం నేను సహించను! ఈ డబ్బును చంప పెళ్ళికే ఉపయోగిస్తాను," అన్నాడు ఆవేశంగా.

దుర్గమ్మ అప్పటికి ఊరుకుని, బంగారు కాసుల గోనె సంచీని గుడిసెలో దాచింది. కట్టెలు కొట్టేవాడు చంపకు పెళ్ళి సంబంధాలు చూడసాగాడు.

మళ్ళీపున్నమి వచ్చింది. ఆరాత్రి దుర్గమ్మ తన కూతురు చుక్కకు చెప్పవలసిందంతా చెప్పి, అడవికి పంపించింది. చుక్క లోగడ చంపలాగే పాడు పడిన బావిలో దూక బోతున్నట్టు, దానికేసి నడిచింది.

అప్పుడు పున్నమిరాత్రిపిశాచం, చుక్కకు అడ్డుపడింది. చుక్క తన తల్లి తిట్లను భరించ లేక బావిలో దూకబోతున్నట్టు పిశాచానికి చెప్పి కళ్ళనీళ్ళు పెట్టుకున్నది.

పిశాచం బావిలోంచి గోనెసంచీ ఒకటి తెచ్చి చుక్కకు ఇచ్చి, అంతాచెప్పి, "జాగ్రత్త! దీని మహిమ ఒక రోజుకే పరిమితం సుమా!" అని హెచ్చరించింది.

చుక్క పరమానందంతో గుడిసెకు తిరిగి వచ్చింది.

సరిగ్గా అదే సమయంలో, ఆ దేశాన్నేలే ముసలిరాజు, తన ఒక్కగానొక్క కొడుకు విజయుణ్ణి గట్టిగా కసురుతున్నాడు.

"ఇంతకూ అసలు నీకు వివాహం చేసుకోవాలని వున్నదా లేదా? నేను త్వరగా నిన్ను పట్టాభిషిక్తుణ్ణి చేసి, విశ్రాంతి తీసుకోవాలనుకుంటున్నాను. నువ్వేమో ఏ దేశపు

రాజకుమారి చిత్రపటం చూసినా పెదవి విరిచి, దూరంగా పెట్టేస్తున్నావు," అన్నాడు రాజు కోపంగా.

ఇందుకు యువరాజు విజయుడు చిన్నగా నవ్వి, "నాకు వివాహం చేసుకోవాలని లేకపోవడం ఏమిటి? ఆ చిత్రపటాల్లోని ఏ రాకుమారీ, మన రాజ్యంలోని కొండ ప్రాంతాన గల అడవిలో కట్టెలు కొట్టుకు బతికే అతడి ఇద్దరు కూతుళ్ళ అందానికి సరిపోలరు," అన్నాడు.

తరచు ఒంటరిగా వేటకు వెళ్ళే విజయుడు, కట్టెలు కొట్టేవాడి కూతుళ్ళ మీద మనసుపడినట్టు గ్రహించిన రాజు, "సరే, ఇంతకూ నువ్వు, కట్టెలు కొట్టేవాడి కూతుళ్ళలో ఎవరిని వివాహమాడదలచావో చెప్పు, కబురుపంపుతాను," అన్నాడు.

"ఇద్దరికిద్దరూ కుందనపు బొమ్మలే! ఒకసారి ఇద్దర్నీ దగ్గరగా చూసి పలకరించి, వాళ్ళల్లో ఒకర్ని భార్యగా ఎన్నుకోదలిచాను," అన్నాడు విజయుడు.

మర్నాడు ఇద్దరూ మారువేషాల్లో బయలుదేరి, కట్టెలు కొట్టేవాడి గుడిసె దగ్గిరకు వెళ్ళారు. అసరికి సూర్యోదయం అవుతున్నది. కట్టెలు కొట్టేవాడు అప్పటికే అడవిలోకి వెళ్ళిపోయాడు. చంప గుడిసె ముందుకళ్ళాపిజల్లి ముగ్గులుపెడుతున్నది.

అపరిచితులను చూడగానే చంప, ఆ పక్కనే వున్న మంచం వాల్చి, "కూర్చోండి!



మా నాన్నకోసం వచ్చారా? ఆయన సాయంకాలానికి గాని ఇంటికి రాడు, మా అమ్మను పిలవమన్నారా?" అని అడిగింది.

ఇంతలో గుడిసె లోపల దుర్గమ్మ తన కూతురు చుక్క మీద తిట్టిన తిట్టు మళ్ళీ తిట్టకుండా తిట్లవాన కురిపిస్తున్నది. ఆ రోజులో ఒక్కక్షణం కూడా వృథా చెయ్యకుండా, కూతురును తెగతిడుతూ గోనె నిండుగా బంగారుకాసులు పోగుచేసుకోవాలని ఆమె ఆత్రం.

చంప గుడిసెలోకి పోయి, ఎవరో ఇద్దరు కొత్తవాళ్ళువచ్చినట్టు, దుర్గమ్మకు చెప్పింది. దుర్గమ్మ ఆ మాటలు వినిపించుకోకుండా, "పొమ్మను! పొమ్మను! సాక్షాత్తూ, ఈ దేశపు

రాజుగారే వచ్చినా, నాకు పలకరించేందుకు తీరిక లేదు," అన్నది.

చంప బయటికి వచ్చి, రాజుతో, "మా పిన్ని అవసరం అయిన పనిలో వున్నది. మరేమీ అనుకోకండి," అని చెప్పింది.

"సరే, వస్తాం!" అంటూ రాజూ, యువ రాజూ తిరుగుప్రయాణం అయ్యారు.

దారిలో రాజు, విజయుడితో, "మనం చూసిన అమ్మాయి లక్షణంగా వుంది. అయినా, ఆ రెండో అమ్మాయిని కూడా చూడాలిగా, రేపు వద్దాం," అన్నాడు.

"అవసరంలేదు, నాన్నగారూ! కన్నతల్లి చేతే అన్ని తిట్లుతింటున్న, ఆ అమ్మాయిని చూడనవసరంలేదు," అన్నాడు.

ఆ మర్నాడు రాజభటులు రాజలాంఛనాలతోవచ్చి, కట్టెలు కొట్టేవాడి కుటుంబాన్ని నగరానికి తీసుకుపోయారు.

రాజప్రాసాదానికి చేరుకున్నాక దుర్గమ్మ, చంపచేతులు పట్టుకుని, "నన్ను క్షమించు, చంపా! కనికరం చూపకుండా, కసాయి దానిలానిన్నువేపుకుతిన్నాను.నాఅసూయకు, కుత్సితబుద్ధికి తగినశాస్తి జరిగింది. నీ మంచితనం, ఓర్పు కొద్దీ నువ్వీ దేశానికి రాణివవుతున్నావు. పున్నమి రాత్రి పిశాచం పుణ్యమా అని, ఎన్ని బంగారుకాసులు ఇంట నుంటే ఏం! నీ చెల్లి చుక్కను ఏ కట్టెలు కొట్టేవాడికో కట్టబెట్టే బదులు, ఉన్న బంగారం కట్నంగా ఇచ్చి, నగరంలోని ఏ కట్టెల దుకాణం వాడికో ఇవ్వక తప్పదు," అన్నది పుట్టెడు దిగులుతో.

చంప,ఆమెనుఓదారుస్తూ, "అదేం మాట పిన్నీ? చెల్లెలికి మంచి సంబంధం వెతికి, ఘనంగా పెళ్ళిచేసే బాధ్యత నాది," అన్నది.

అప్పుడు, యువరాజు విజయుడు, "ఇదేం మాట, చంపా? దేశానికి రాజు కాబోతున్న నాకు తోడల్లుడుగా మరొక రాజకుమారుడే కావాలి. అలా కానప్పుడు మనిద్దరికీ ఎంత తలవంపు!" అని, దుర్గమ్మతో, "అత్తగారూ, మీరేం దిగులు పడకండి, మరదలికి మరొక దేశం రాకుమారుడితో వివాహం జరిగేలా చూసే బాధ్యత, నాది," అన్నాడు.



# చందమామ కబుర్లు

## 'కొలంబస్ కాదు, ఫాహ్యాన్'



500 సంవత్సరాలకు పూర్వం ఇటలీనావికుడు క్రిస్టఫర్ కొలంబస్ అమెరికాను కనుగొన్నాడని ప్రపంచం విశ్వసిస్తున్నది. ఆ చారిత్రాత్మక సంఘటన జరిగి 500 సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా గత డిసెంబర్ 12వ తేదీ భారీ ఎత్తున వేడుకలు కూడా జరుపుకున్నారు. అయితే, ఇప్పుడు అమెరికాకు వచ్చిన లియాన్ యున్‌షాన్ అనే ఒక చైనా చారిత్రక పరిశోధకుడు దీనిని కాదంటున్నాడు. చీనాకు చెందిన ఫాహ్యాన్ అనే బౌద్ధసన్యాసి (334-422) (ఇతడు 4వ శతాబ్దంలో భారతదేశాన్ని సందర్శించాడు) క్రిస్టఫర్ కొలంబస్‌కు వెయ్యేళ్ళముందు అంటే 412 వ సం॥లో 'ఎపోటీ' రాజ్యంలో అడుగుపెట్టాడని అభిప్రాయ పడుతున్నాడు. ఎపోటీ రాజ్యం అమెరికా పశ్చిమతీరంలో ఈనాటి లాస్‌ఏంజెలెస్ సమీపంలో ఉండేదని ఆయన అభిప్రాయం. 1,500 సంవత్సరాలనాటి ఫాహ్యాన్ స్వీయచరిత్ర నుంచి ఆధారాలు ఎత్తిచూపుతూ లియాన్‌యున్‌షాన్ ఒక అంతర్జాతీయ సదస్సులో తన అభిప్రాయాన్ని వెల్లడించాడు.



## 'క్యాలండర్ బాబు'

ఈ సంవత్సరం రిపబ్లిక్‌దినం ఏ రోజు వచ్చింది? మంగళవారం. జనవరి 1 ఏ వారం? శుక్రవారం. మరి 1990 జనవరి 1వ తేదీ ఏ వారం? దీనికి పాత క్యాలండర్ తిరగవేయాలి కదూ! అయితే, ఏ క్యాలండర్ సహాయం లేకుండానే అనీష్ నటరాజన్ 'సోమవారం' అని సరిగ్గా చెప్పగలడు. తమిళనాడు 'ఈరోడ్'కు చెందిన ఈ ఐదేళ్ళ కుర్రాడు ఏ నెల? ఏ తేదీ, ఏ వారం అడిగినా క్షణాలలో చెబుతున్నాడు. అందుకే ఆ 'మేధావి'ని అందరూ 'క్యాలండర్ బాయ్' అని పిలుస్తున్నారు. అయిదేళ్ళకే గణితంలో అద్భుతమైన జ్ఞాపకశక్తిని కనబరుస్తున్న అనీష్ మునుముందు ఎలాంటి ఘన విజయాలు సాధించగలడో చూడాలి!

## ఒంటరిగా దక్షిణ ధ్రువానికి!



1990వసం॥లో నార్వేకు చెందిన ఎర్లింగ్ కాగే తన మిత్రుడితో కలిసి ఉత్తర ధ్రువయాత్ర చేశాడు. 29 ఏళ్ళ సాహసవంతుడైన ఆ లాయర్ ఇప్పుడు ఒంటరిగా 50రోజులు ప్రయాణంచేసి ఈ సంవత్సరం జనవరి మొదటివారంలో దక్షిణధ్రువాన్ని చేరుకున్నాడు. 120 కి.గ్రా. బరువుగల అవసరమైన వస్తుసామగ్రిని లాక్కుంటూ రోజుకు 26 కి.మీ. ప్రకారం 1,310 కి.మీ. 'స్కెయింగ్' చేస్తూ అనుకున్న దానికన్నా పది రోజుల ముందే గమ్యస్థానం చేరుకున్నాడు. ఒంటరిగా దక్షిణ ధ్రువాన్ని చేరుకున్న మొట్టమొదటి వ్యక్తి ఎర్లింగ్ కాగే.



# మనుష్యయత్నం

ఒక ఊళ్ళో ఒక గొర్రెలకాపరి ఉండేవాడు. వాడొక రోజు సంతకు వెళ్ళవలసి వచ్చింది. తన మందను చూస్తూ ఉండమనటానికి వాడికెవరూ దగ్గిరవాళ్ళు గాని, ఇరుగు పొరుగువాళ్ళుగాని లేరు. అందుచేత వాడు దేవుడిపైన భారంవేసి, బీడులో మేస్తున్న మందను వదిలి తిన్నగా సంతకు బయలు దేరాడు.

గొర్రెలకాపరి కొంతదూరం వెళ్ళేసరికి, సంతనుంచి తిరిగి వస్తూ ఎరిగిన వాడొకడు కనబడి, "హడావుడిగా వెళుతున్నావు, ఎటూ గానివేళ ఎక్కడికి బయలుదేరావు,అన్నా?" అని అడిగాడు.

"సంతలో ఒక ముఖ్యమైన పనుంది. తప్పనిసరిఅయి పోతున్నా,"అన్నాడు గొర్రెల కాపరి.

"మరి మందనెవరు చూస్తున్నారు?" అన్నాడు ఎరిగున్నవాడు.

"ఎవరున్నారుచూడటానికి? నాకు ఇరుగా పొరుగా? ఎవ్వరూ లేరు. అంతా దేవుడే చూస్తాడు," అంటూ గొర్రెలకాపరి గబాగబా ముందుకు సాగాడు.

"దేవుడేం చూస్తున్నాడో నేను చూస్తాను," అనుకుని రెండోవాడు సరాసరి గొర్రెల మందను సమీపించి, బాగా కొవ్విన గొర్రెలను ఇరవైఅయిదింటిని ఏరుకుని, వాటిని హాయిగా తన ఊరు తోలుకు పోయాడు.

గొర్రెలకాపరి సంతకు పోయి, అక్కడ తన పని చూసుకుని, తిరిగి వచ్చేసరికి మందలో పాతిక గొర్రెలు తరుగైనట్టు తెలిసింది. వాటికోసం వాడు ఎంతగానో బాధ పడ్డాడు. ఆఖరికి వాడు దీర్ఘంగా నిట్టూర్చి, "గొర్రెలను కాసేపని ఇకమీదట దేవుడిమీద వేసి లాభంలేదు," అనుకున్నాడు.

ఇలా అనుకుని వాడు తన గొర్రెలను కాయటానికి రెండు కుక్కలను కొన్నాడు.

25–ఏళ్ళనాటి చందమామ కథ

ఆ కుక్కలను అమ్మినవాడు ఆ కుక్కలకు రోజూరెండేసిపలాలమాంసంవెయ్యమన్నాడు. అందుకని గొర్రెలకాపరి తన కుక్కలకు రోజూ రెండేసి ఎలుకలను వేస్తూవచ్చాడు.

కుక్కలనుపెట్టినాకూడా మంద నష్టపడు తూనే వచ్చింది. ఆ ప్రాంతాల తోడేళ్ళు జాస్తి. అవి ప్రతి రాత్రీ మందలోకి జొరబడి ఒకటో, రెండో గొర్రెలనులాక్కుపోతూండేవి. మర్నాడుదయం గొర్రెలను ఎంచుకుంటే నష్టం బయట పడేది. తోడేళ్ళు రావటం కుక్కలు చూసేవిగాని, ఏమీ చేసేవి కావు; తోడేళ్ళు గొర్రెలను ఈడ్చుకు పోతూంటే చూస్తూ ఉండిపోయేవి. తోడేళ్ళు చంపి తినగా మిగిలిన గొర్రెల మాంసాన్ని కుక్కలు ఆవురావురని తినేసేవి.

ఇలా ప్రతిరోజూ జరుగుతున్నది. మంద నానాటికీ పలచనవుతున్నది. ఏం చెయ్యాటానికీ పాలుబోక గొర్రెలకాపరి హతాశుడయ్యాడు. "ఈ విధంగా సాగిపోతే సంకురాత్రికి ఒక్క గొర్రె మిగలదు," అనుకున్నాడు వాడు.

వాడు అసహాయుడై, కంట కన్నీరు కార్చసాగాడు.

అంతలో ఒక గడ్డంతాత అటు వెళుతూ గొర్రెలకాపరిని చూసి ఆగి, "ఎందుకురా, వెర్రినాగన్నా, కంట తడిపెడుతున్నావు? నీకు ఏం కష్టం వచ్చిపడింది?" అని అడిగాడు.

"ఏడవ కేం జెయ్యను? దేవుడి మీద భారం వేసి సంత కెళ్ళిన రోజున పాతిక



గొర్రెలు మాయమయ్యాయి. మందను కనిపెట్టి ఉంటాయి గదా అని రెండు కాపలా కుక్కల్ని కొంటే, అవి ఉండీ, లేకా ఒకటిగానే ఉంది. ప్రతిరోజూ తోడేళ్ళు వచ్చి, ఒకటి రెండు గొర్రెల్ని కాజేసుకు పోతూనే ఉన్నాయి. ఇంత జరుగుతుంటే, దరిద్రపు కుక్కలు మొరగనన్నా మొరగవు!" అన్నాడు గొర్రెలకాపరి.

"కుక్కల కేం ఆహారం పెడుతున్నావు?" అన్నాడు గడ్డంతాత.

"రెండేసి పలాలు మాంసం పెడుతు న్నాను. అంటే రోజు తప్పకుండా రెంటికీ చెరో ఎలుకా వేస్తున్నాను. ఆ వెధవ కుక్క లకి అది చాలదా ఏం?" అన్నాడు గొర్రెల కాపరి ఎంతో విసుగ్గా.

"ఇంకేం? అందుకే నీ గతి ఇందాకా వచ్చింది. అడపా దడపా నువ్వు ఓ గొర్రెను కోస్తూంటావు గద, దాని మాంసం కుక్క లకు తిన్నంత వేస్తూ ఉండు. నీ పని నువ్వు సరిగా చేస్తే, కుక్కలు కూడా తమ పని సరిగా చేస్తాయి," అన్నాడు గడ్డంతాత.

అది మొదలు గొర్రెల కాపరి తన కుక్కలకు కడుపు నిండా తిండి పెడుతూ వచ్చాడు. మొదటి రోజు మందలోనుంచి ఒక్క గొర్రె కూడా పోలేదు. రెండో రోజు చీకటిపడే వేళ రెండు తోడేళ్ళు మందకేసి వేగంగా వచ్చాయి.

"పదండి, పదండి! మా యజమాని మాకు కడుపు నిండా తిండి పెడుతున్నాడు. మీ ఎంగిలి మాకక్కర్లేదు," అని ఒక కుక్క మొరిగింది.

"వెళ్ళకండి,అన్నల్లారా! వచ్చి, మీ కడుపు నింపుకుని, మాక్కూడా ఇంత పెట్టండి," అని రెండో కుక్క గట్టిగా మొరిగింది.

తోడేళ్లు రెండో కుక్క మాటలే నమ్మాయి. ఎందుకంటే, అంతవరకు కుక్కలెన్నడూ తమకు ఎదురు చెప్పిన పాపాన పోలేదు. ఆ ధైర్యంతో రెండు తోడేళ్ళూ మందలో ప్రవేశించాయి.

మరుక్షణమే కాపలా కుక్కలు రెండూ భయంకరంగా అరుస్తూ వాటిపైన పడి, వాటిని చీల్చి చంపేశాయి.



# ప్రకృతి వింతలు

## నశిస్తూన్న పులులు!

కేంద్రప్రభుత్వం రెండు దశాబ్దాల క్రితం చేపట్టిన 'పులుల పరిరక్షణ' పథకం ఫలితంగా మనదేశం లోని 17 జంతురక్షణాలయాలలో ఉంటూన్న పులుల సంఖ్య 1,800 నుంచి 4,300 వరకు పెరిగింది. అయితే, ఈ జంతురక్షణాలయాలలో సైతం ఇటీవల దొంగతనంగా వేటాడడం జరుగు తున్నది. ఇలా జంతువులను చంపడం మనదేశం లోనే కాదు, ఉపఖండంలోని ఇతర దేశాలయిన నేపాల్, భూటాన్, బంగ్లాదేశ్‌లలో కూడా జరుగు తున్నది. ప్రపంచం మొత్తం మీద ఈనాడు ఏడెనిమిది వేలదాకా ఉన్న పులులలో దాదాపు 60శాతం మన ఉపఖండంలోని నాలుగు దేశాల లోనే ఉన్నాయి. గత డిసెంబర్‌లో వాతావరణ వేత్తల అంతర్జాతీయ సదస్సు ఢిల్లీలో జరిగి నప్పుడు—పులుల పరిరక్షణకు తీవ్రమైన చర్యలు తీసుకోక పోయినట్టయితే 2020 వ సం॥లోగా పులులు కేవలం జంతుప్రదర్శనశాలల వరకే పరిమితమైపోయే ప్రమాదం వస్తుందని హెచ్చ రించారు!

## నిర్మూలమైపోతూన్న జీవరాశులు!

పులులే కాకుండా దాదాపు, 150 జంతుజాతులు అంటే– సస్తన జంతువులు, పక్షులు, ప్రాకుడు జంతువులు, ఉభయచరాలు, కొన్నిరకాల కీట కాలు నశించిపోయేదశలో ఉన్నాయి. ముఖ్యంగా సింహం, ఏనుగు, అడవిగాడిద, ఖడ్గమృగం, సింహంతోక కోతి, 'ఇండస్ డాల్ఫిన్' నశించి పోయే అపాయం ఎక్కువగా ఉన్నదని విజ్ఞాన వేత్తలు అంటున్నారు. ఈ జంతువులు మన దేశమంతటా నివసిస్తున్నాయి. కాబట్టి ప్రజ లందరూకూడా ప్రకృతిని అనుసరించి జీవిం చడం నేర్చుకుంటే తప్ప, మన మిత్రులయిన ఈ జంతువుల వినాశం తప్పదని విజ్ఞానవేత్తలు అభిప్రాయపడుతున్నారు.

## రెండు అభిప్రాయాలు

ఒకప్పుడు డినోజార్స్ అనే రాక్షసబల్లులు భూమి మీద చాలా ఉండేవి. అవి హఠాత్తుగా నశించి పోవడానికి రెండు రకాల కారణాలు చెబుతారు. దాదాపు 4,000,000 సంవత్సరాలకు పూర్వం అగ్ని పర్వతాలు బద్దలై విపరీతమైన లావాను విరజిమ్మాయనీ, అది భూమిని ముంచెత్తడంతో రాక్షసబల్లులు పూర్తిగా నశించిపోయాయనీ మొదట కొందరు విజ్ఞానవేత్తలు అభిప్రాయ పడ్డారు. మెక్సికోలో 170 కి.మీ. వెడల్పయిన జ్వాలాముఖాన్ని కనుగొన్నారు. అంతరిక్షంనుంచి వచ్చిన ఒక పెద్దగ్రహం కాని లేదా తోకచుక్కగాని భూమిని ఢీకొనడంవల్ల ఆ జ్వాలాముఖం ఏర్పడి ఉండవచ్చని భావిస్తున్నారు. 65,000,000 సంవత్సరాలకు పూర్వం అలా ఢీకొన్నప్పుడే



ఆనాటి భూమి మీది 70శాతం జంతుజాలం, రాక్షసబల్లలతోసహా నశించిపోయాయని కొందరు విజ్ఞానవేత్తలు అభిప్రాయపడ్డారు. అయితే, ప్రస్తుతం మనిషి జంతువులపట్ల చూపుతున్న అనాదరణ, క్రౌర్యం జంతువుల వినాశానికి దారితీస్తున్నాయి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1993 మే నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

※ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ※ మార్చి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ※ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ※ వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 26.

---

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చాలు నేస్తాలతో ఆట! రెండవ ఫోటో : ప్రారంభిద్దాం ఆకలి వేట!

పంపినవారు : ఎస్. శ్రీనాథ్, s/o ఆంజనేయులు, మున్సిపల్ ఆఫీసు, చిలకలూరిపేట-522 616 గుంటూరు జిల్లా (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**


---

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతిప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి:

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి।

సంవత్సర చందా:

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా: రూ. 105.00 ఎయిర్ మెయిల్ ద్వారా: రూ. 252.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా: రూ. 111.00 ఎయిర్ మెయిల్ ద్వారా: 252.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి:

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026